| | | పుట. |
|---|---|---|
| 115. ముడుంబి—వేంకటరాచార్యుడు. | ... | 210. |
| 116. అక్కెనపల్లి-నృసింహకవి | ... | 211. |
| 117. పైడిపాటి- వేంకటనృసింహకవి. | ... | 213. |
| 118. కోటికలపూడి— వేంకటకృష్ణకవి | ... | 214. |
| 119. కాకెపర్తి—కృష్ణకవి | ... | 216. |
| 120. కృష్ణయ్య. | ... | 217. |
| 121. తిరిగొండ—వెంకయ్య. | ... | 218 |
| 122. పిండిప్రోలి—లక్ష్మణకవి. | ... | 221. |
| 123. అల్లమరాజు—రామకృష్ణకవి. | ... | 225. |
| 124. కాకెపర్తి—చిప్పపాత్రకవి. | ... | 227. |
| 125. శిష్టు—కృష్ణమూర్తికవి. | ... | 229. |
| 126. మంత్రిప్రెగడ—సూర్యప్రకాశకవి. | ... | 233. |
| 127 ముక్కు— వేంకటనరసయ్య. | ... | 235. |
| 128 వేల్పూరి- వేంకటేశ్వరకవి. | ... | ,, |
| 129. తిరుమలకొండ్రపట్టణపు-చినతాతాచార్యుడు. | | 238. |
| 130. మాడభూషి—నృసింహాచార్యుడు. | ... | 239. |
| 131. కోటగిరిరాజు—నాగయ. | ... | ,, |
| 132. కరాలపాటి—రంగయకవి. | ... | 240. |
| 133. గామరాజు—లక్ష్మీనారాయణ | ... | 241. |
| 134 త్యాగరాజ మొదలి. | ... | |
| 135. తిగిరాల—జగన్నాథకవి. | ... | |
| 136. నడకట్టి—రామకవి. | ... | |
| భూషి—వేంకటాచార్యకవి. | | |

# ఆంధ్రకవులచరిత్రము.

## మూడవభాగము-ఆధునికకవులు.

### హరిభట్టు.

ఈకవి మత్స్యపురాణమును వరాహపురాణమును తెనిఁగించెను. ఇతని నివాసస్థానము కంబముమెట్టు; ఇది బెజవాడకు నామడదూరములో నున్నది. ఇతఁడు తన వరాహపురాణమునందు కంబముమెట్టుగ్రామము నీప్రకారముగా వర్ణించియున్నాఁడు-

సీ. వరుణదిగ్వీధి నేపురమునఁ బ్రవహించెఁ బావనసలిలసంపన్న మన్న
దీపించె నేపురి గోపికామానసాస్పదవర్తి చెన్నగోపాలమూర్తి
భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తివిత్రాణి కొండనృసింహశార్ఙ్గపాణి
యేపట్టణంబునఁ జూపట్టె హితపద్మహేళి పీకేశబాలేందుమౌళి
చతురచతురంగబలరత్నసౌధయూథ। సాలగోపురతోరణసకలవర్ణ
పూరవారాంగనాజనప్రముఖవస్తు। మేదురం బట్టికంబముమెట్టుపురము.

కవి వైదికబ్రాహ్మణుఁడు; భారద్వాజసగోత్రుఁడు; రామపండితుని పుత్రుఁడు. ఇతఁడు మొదట వరాహపురాణమును కోటిపాక యెఱ్ఱనామాత్యుని కంకితము చేసెను.

మ. ఘనతేజుం గోటిపాక యెఱ్ఱనికిఁ గౌశౌర్యగాంభీర్యస
త్త్వఃప్రభుత్వోక్తి ధనాఢ్యయోగ్యవినయస్త్యాగక్రియాశాంతులన్
సవితన్ సాత్యకి సింధుసీరి సురరాట్సూను సేనాని సైం
ధవవిచ్ఛేదను సోము సౌమ్యమున సంతానంబు సన్యాధిపున్.

ఇత్యాది పద్యములచేత గుణక్రమమునఁ గవి కృతినాయకుని నెంతగా నభివర్ణించినను,

క. శ్రీమహితస్తంభాచల। నామసముద్దామపట్టణస్థలగణక
గ్రామణికి బంధుహితకర। శ్రామణికిఁ గవీంద్రపంకజనభోమణికిన్.

అను షష్ఠ్యంతపద్యమువలన నతఁడాయూరి కరణమయినట్టు స్పష్టపడుచున్నది. ఇట్టి సాధుకగ్రామణి నిన్నుఁ బిలిపించి

మ. అమృతప్రాయవచోవిశేషరచనాహంభావసంభావనా
గ్రమణీమూర్తివి వేదశాస్త్రవివిధగ్రంథార్థనిర్ణీతి నే
కముఖబ్రహ్మవు యాజుషప్రకటశాఖాధర్మధుర్యుండవ
ర్యమతేజుండవు రామనార్యహరిభట్టా సత్కవిగ్రామణీ.

గీ. అష్టఘంటావధానవిశిష్టబిరుద । నీవు రచియింపఁ దలఁచిన నిరుపమార్థ
రమ్య మగు నీవరాహపురాణకావ్య । మంకితము చేయు నా పేర నభిమతముగ.

అని పలికినట్లు కవి వ్రాసికొనియున్నాఁడు. పయిపద్యమునందే గాక యాశ్వాసాంత గద్యమునందును "అష్టఘంటావధానపరమేశ్వర బిరుదవిఖ్యాత" యని కవి వ్రాసికొనెను గాని యీబిరుద మెవ్వరిచే నియ్యఁబడినదో తెలియఁబడదు. అయినను కవిత్వమాత్రము పయిపద్యమునందుఁ జెప్పఁబడిన రీతిగా నమృతప్రాయముగానే యున్నది. ఇతఁడు తా నాపస్తంబసూత్రుఁ డయినట్టును తిమ్మాంబపుత్రుఁ డయినట్టును మత్స్యపురాణములో నీక్రింది పద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

శా. భారద్వాజసగోత్రసంభవుఁడ నాపస్తంబుఁడన్ రమ్యకాం
బారాజద్వరగర్భసంభవుఁడ రామక్ష్మాసురానేకజ
న్మారూఢాధికపుణ్యలబ్ధహరినామాంకాప్తసంస్తుత్యుఁడన్
శ్రీరామావరపాదపద్మయుగళీచింతాసమాయుక్తుఁడన్.

ఇతఁడు మొదట రచించిన వరాహపురాణమును నరాంకితము చేసి యటు చేయుట పాపకార్యమని తలఁచి తత్పాపపరిహారార్థముగా మత్స్యపురాణమును శ్రీరంగాంకితము చేసి యందీక్రిందిపద్యమును పొందుపఱిచెను—

సీ. ఆయురారోగ్యనిత్యైశ్వర్యములు గల్గి విభవంబుతో ధాత్రి వెలయుకొఱకు
ధనముకై నరాధముల సన్నుతిచేయఁ బొడమినపాపము పెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశపదపంకజములందు నిశ్చలవృత్తితో నిలుచుకొఱకు
లోకవాదులఁ బాసి రయమున వైకుంఠసదనంబునకు వేడ్కఁ జనెడుకొఱకుఁ
బరమవైష్ణవజను లెల్లఁ బ్రస్తుతింప । మత్కృతం బయి హరికథామాన్య మగుచు
నుత్తమం బగు విష్ణుధర్మోత్తరంబు । రంగనాథున కర్పింతు రమణ మెఱసి.

కవికాలమును నిర్ణయించుటకీ పుస్తకములు రెంటిలోను నాధారము లేశ మయినఁ గానరాలేదు. అక్కడక్కడఁ గొన్ని యల్పదోషము లున్నను మొత్తముమీఁద నిర్దుష్టమని చెప్పఁదగిన గ్రంథరచననుబట్టియు శైలినిబట్టియు చూడఁగా నీపుస్తకములు చిరకాలము క్రిందటనే రచియింపఁబడిన వయినట్టు తోఁచుచున్నది. "అష్టఘంటావధాన" యని రెండు పుస్తకములయందును గనఁబడుచున్నది. గంటమును తెలుఁగుశబ్దమునకుఁ

సెరిచిన కర్మకాండమున హింసయు జ్ఞానమునందుఁ గర్మమున్
వదలక పల్కుచుందురు ప్రవాహములన్విపరీతవృత్తులై. — ఆ. ౧.

చ. తిరిగిరిఁ గాననంబు లతితృష్ణఁ జలింపక తద్వనంబులన్
దొరకవు కందమూలములు తోయజనాభుని యాజ్ఞఁ గాక యి
ప్పురమున నన్నపూర్ణ ప్రభురాలయి విహరింపుచుండఁగాఁ
గలవరనే తదన్నములకాలమున న్నమమందిరంబునన్. — ఆ. ౨.

ఉ. విప్రులు నీచకర్మపరులై జనవారికి మంత్రతంత్రముల్
తప్పినఁ బ్రత్యవాయములు తారొకనివచ్చునెకాని దానికే
దప్పరమేశుఁ బొందమపరియత్నము నేనిట నీకు వేడుకం
జెప్పెద గుప్తమార్గమునఁ జేయుము తత్క్రియ భూసురోత్తమా — ఆ. ౩.

మ. రమణీబంధుజనాప్తుల న్విడిచి తద్రాజ్యంబు వర్జించి దు
ర్దమకామాదులఁ జెదరీక హృదయస్థైర్యంబున న్నించి నీ
వమితోద్యద్గుణకీర్తనామృతముచే నాహ్లాదయుక్తుండవై
విమలాంతఃకరణుండ వైనగతి నే వీక్షించితిం బుత్రకా. — ఆ. ౪.

మ. హరి సంగీతవినోదలోలుఁ డగుచో నత్యంతశీఘ్రంబునన్
వరగానంబుల నాత్మసద్గుణకథావర్ణంబులై నట్టిగీ
తరసంబుల్ రసనం జపింగొనుమగ్ర్యశ్రేణి కిష్టార్థముల్
పరిపూర్ణంబులుగా నొసంగును దయాపాంగుండై వేడ్కన్ — ఆ. ౫.

## ఒప్పెపూడి-పెద్దయ్య

ఈకవి వాయుపురాణమును తెనిఁగించి, పురుషోత్తమపట్టణ నివాసుఁ డయిన దాసరి చిన్నగంగయ్య యను కమ్మచౌదరి కంకితము చేసెను. పురుషోత్తమపట్టణము కొండపల్లెకుఁ బ్రాగ్భాగమున నున్నట్టును, దానిని వీరపురుషోత్తమగజపతి తనపేరఁ గట్టించినట్టును గవి చెప్పియున్నాఁడు. వీరపురుషోత్తమగజపతి కొండవీటి కధిపతిగా నుండి క్రీస్తుశకము ౧౪౬౧ వ సంవత్సరము మొదలుకొని ౧౪౯౬ వ సంవత్సరము వఱకును రాజ్యపాలనము చేసెను. ఈతని తరువాత రాజ్యమునకు వచ్చిన యితని మనుమఁ డైనవీరభద్రగజపతిని ౧౫౧౫ వ సంవత్సరమునందు కృష్ణదేవరాయలు జయించి కొండవీటిని స్వాధీనము చేసికొనెను. దీనిబట్టి వాయుపురాణము కృష్ణదేవరాయలకాలమునకు ననంతరముననే రచియింపఁబడినట్లు తెలిసినదికాని యెప్పుడు చేయఁ

బడినదో తెలియదు. అప్పకవి యీపురాణమునుండి పద్యముల నుదాహరించియుండక పోవుట మొదలయిన కొన్ని హేతువులనుబట్టి హరిభట్టకవికాలమునవలెనే యీకవికాలమును ౧౬౬౦ వ సంవత్సరప్రాంతమని యూహింపఁదగియున్నది. ఈయిద్దఱుకవులును కవిత్రయమని ప్రసిద్ధిగన్న నన్నయతిక్కనశంభుదాసులనుదక్క నితరాంధ్రకవులను దమగ్రంథములయందుఁ జేర్కొనియుండలేదు. కవి కృతినాయకుఁ డయిన చినగంగయ్య కొలువునఁ గూర్చుండి తన్నుఁగూర్చియు సభికులనుఁగూర్చియుఁ బలికిన వాక్యముల నిట్లు చెప్పియున్నాఁడు—

సీ. అతులితశాస్త్రేతిహాసంబు లొకవంక నొకవంక దండగాయకగణంబు
తతచతుర్విధవేదతత్త్వజ్ఞు లొకవంక నొకవంక నిపుణశాబ్దికచయంబు
ప్రకటితప్రౌఢతార్కికబృంద మొకవంక నొకవంకఁ జతురవాక్సుకవినికర
మకలంకపౌరాణికకదంబ మొకవంక నొకవంక జ్యోతిషప్రకరవేత్త
లొక్కచో బంధుచయంబు లొక్కయెడ స
మగ్రసామంతనివహంబు మహిమఁ గొలువఁ
గొలువుకూటంబు నందుండి కలితవచన
గౌరవము మీఱ సభికులఁ గాంచి పలికె.

* * * *

చ. వినతసమస్తభూభుజుని వేంకటమంత్రికిఁ బేరమాంబకున్
దనయునిఁ బుణ్యవర్తనుని దానగుణాన్వితు నారసింహహృ
ద్వనరుహచంచరీకు ననివార్యవచోరచనావిశారదున్
నను బినయొడ్డెపూడిపురినాథునిఁ బెద్దకవీంద్రచంద్రునిన్.

తోటకము.—వినయంబునఁ గన్గొని వేడుక ని
ట్లను నీసుకవీంద్ర సురోచకథల్
వినినంత నభీష్టనవీ ఫలం
బనయంబును గల్గు జనావళికిన్.

* * * *

ఉ. పంకజగర్భదారకటిభాగవిభాసితభర్మమేఖలా
కింకిణికావిరావములఁ గేరు తదీయకరాగ్రవిస్ఫుర
త్కంకణనిక్వణంకనినదంబు నగుం బినయొడ్డెపూడిమా
వేంకటమంత్రిపెద్దన నవీనవిలాసవచోనిగుంభనల్.

ఈకవి నియోగిబ్రాహ్మణుఁడు; కాశ్యపగోత్రుఁడు; వేంకటమంత్రి పుత్రుఁడు; ఒడ్డె

పూడి గ్రామమునకు కరణము. ఇతఁడు వాయుపురాణములోని కొంతభాగమును మాత్రమే తెనిఁగించినట్టు కనఁబడుచున్నది. ఈతని కవిత్వమునం దక్కడక్కడఁ గొన్ని దోషము లున్నను మొత్తముమీఁద కవిత్వము రసవంతముగానేయున్నది. వాయు పురాణమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

మ. కరకోచ్చారితమై ఘనాఘనబృహద్గర్జారవోపేతమై
ఖరవిద్యుల్లతికాతతిప్రబలమై వాస్తోష్పతీష్వాసబం
ధురమై సర్వదిశావిభాగములు నస్తోకాంబుపూర్ణంబుగాఁ
గురిసెన్ వర్షము నీడజవ్రజము సంక్షోభింప భీమంబుగన్.— అ. ౧.

ఉ. పొంగిన వేడ్కఁ జేనతఁ డపూర్వముగా విహరించుచుండి యా
చెంగటఁ గాంచె దివ్యసరసీరుహశోభితమత్తభృంగసం
తుంగతరంగఁ దోయపరిలోపకీర్ణబలాకచక్రచ
క్రాంగ నభంగగంగ నికటాగతసంయమిసంగ నెంతయున్.— అ. ౨.

మ. కడుమార్గంబున నుండి మేను వడఁకంగాఁ బాదముల్ తొట్రిలన్
వడచేఁ జిక్కి హరీ యటంచును గృహద్వారంబుఁ జేరంగ నే
నిడఁగాఁ బంచితి నీరసాన్న మతఁడున్ హేయంబుగాఁ జూడకే
కుడిచెం దత్కలుషంబు చేయుకతనన్ ఘోరాటవీభూములన్.— అ. ౩

మ. మునిసంఘంబులు మ్రొక్కఁ దామరలు సమ్మోదంబున న్నిక్కఁ గో
కనికాయంబుల కింపు లెక్కఁ గుముదౌఘంబుల్ రుచుల్ డక్కఁ జో
ర్వనిగర్వంబులు దూలి జాలి బడి జీవంజీవముల్ క్రుక్కఁ దూ
ర్పున మార్తాండుఁడు గానిపించె భువనంబుల్ రంజిలం జేయుచున్.— అ. ౪

ఉ. ఇంద్రుఁడ నీవు దుఃఖపడ నేటికిఁ గ్లాని మాని చేయుని
స్తంద్రతపంబు మాన్పుటకు శక్యము గాదని నేల భీకతన్
రుంద్రమతిన్ స్మరింపుము నిరూఢిగ నే నిది చక్కఁ జేసెదన్
జంద్రముఖీవిలోకనసుసంగతిఁ జొక్కరె యెట్టివారలున్.— అ. ౫.



## కాకమాని - మూర్తి.



ఈకవి కాకమానికులజుఁడైన బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; రామలింగ భట్టపుత్రుఁడు. ఇతఁడు పాంచాలీపరిణయము, రాజవాహనవిజయము, అను రెండు

ప్రబంధములను రచియించెను. రాజవాహనవిజయములోని యీక్రిందిపద్యమునబట్టి యీకవి యింటిపేరు పెన్నావారని తెలియవచ్చుచున్నది.—

సీ. గుణధన్యుఁ గౌండిన్యగోత్రు నాపస్తంబసూత్రుని వెలనాటి శుభచరిత్రుఁ
గాకమానీమహాగ్రామాబ్జమిత్రుఁ బెన్నాకలశాబ్ధిరాకశత్రు
సరసకవిత్వకవి సార్వభౌముని రామబుధసంభవునకుఁ బ్రబోధసుధికిఁ
బౌత్రునిఁ బినరామభట్టాగ్రజన్ముఁడై తనరు శ్రీరామలింగనకుఁ దిమ్మ
మాంబికకుఁ బుత్రు సూర్యనారాయణద్వ । యైకసహజన్ము నుభయభాషాకవిత్వ
తత్త్వనిధి నన్ను మూర్తిపద్యకవీంద్రు । హర్షమునఁ జూచి యిట్లని యానతిచ్చె.

ఇతఁడు తనగ్రంథములను నరాంకితములఁ జేయక రాజవాహనవిజయమును శ్రీవేంకటేశ్వరులకును, పాంచాలీపరిణయమును శ్రీరంగపతికిని, అర్పించినందునఁ గృతిపతులను బట్టి కవికాలమును నిర్ణయించుట కాధారము లేదు. ఇతఁడు కృతిస్తుతిలో నైనను పాంచాలీపరిణయమునందలిఁ బ్రాచీనాంధ్రకవులను బేర్కొనక తనముత్తాతయు తాతయు నైనగామపండితుని ప్రబోధపండితునిమాత్ర మీపద్యమునందు పేరులుపెట్టి స్తుతించి యున్నాఁడు.—

చ. ప్రబలమతి న్నుతింతుఁ బ్రతిభాకృతిభాషితభారతీశులన్
గబళితసర్వదిగ్యశులఁ గావ్యచమత్కృతికాళిదాసులన్
నిబిడయశోవిలాసులఁ దృణీకృతవాములఁ గాకమాని రా
మబుధవిధున్ బ్రబోధసుధి మత్ప్రపితామహునిన్ బితామహున్.

రాజవాహనవిజయమునందు వీరినిగాక యీపద్యమునందుఁ గవిత్రయమును గూడఁ జేర్చి యున్నాఁడు.—

ఉ. శ్రీరఘురామకావ్యకృతిశిష్టవిధిజ్ఞుఁ బరాశరాత్మజున్
భారవిఁ గాళిదాసు శివభద్రు మురారి మయూరు బిల్హణున్
జోరుని మల్హణాదిసురసూక్తికవీంద్రులఁ గొల్చి యొంచెదన్
భారతకర్తృతాచణుల నన్నయఁ దిక్కన నెఱ్ఱనార్యునిన్.

ఇతఁ డన్యకవుల నెవ్వరిని గొనియాడకపోయినను వసుచరిత్రకర్త యైనభట్టుమూర్తికిఁ దరువాతివాఁ డనుటకు సందేహము లేదు. వసుచరిత్రకర్త మూర్తి యన్నమాటవినఁ బడఁగానే మూర్తి నరసభూపాలీయకర్తగాని వసుచరిత్రకర్త కాఁ డనియు, ఉభయ గ్రంథకర్తలు భట్టువంశజులు నేకకాలపువారగుటచేఁ బూర్వకాలమునుండియుఁ బండితపామరసాధారణముగా వసుచరిత్రకారుఁడు భట్టుమూర్తి యన్న భ్రమ యంధపరంపరగా వచ్చుచున్నదనియు, కొందఱు చెప్పవత్తురు. ఒక్కకాలమునం దిద్దఱు

కవులుండి వారిలో నొక్కఁడు సుప్రసిద్ధుఁడును రెండవవాఁ డప్రసిద్ధుఁడునునయినప్పుడు సుప్రసిద్ధునిపేరడఁగిపోయి యప్రసిద్ధునిపేరు పైకివచ్చుట యెన్నఁడును సంభవింప నేరదుగాన, అధికప్రసిద్ధుఁ డయిన రామరాజభూషణునిపేరే గడుగంటి యాతని గ్రంథకర్తృత్వము భట్టుమూర్తిమీఁదఁ బడెననుట యుక్తియుక్తము కాదు. ఒకవేళ భ్రమకలిగెడుపక్షమున, నరసభూపాలీయకర్త రామరాజభూషణుఁడని కలుగవలెను. అప్రస్తుతమైన యీయంశము నటుండనిచ్చి కావ్యాంశమును వత్తము. అనేకు లీకవిని భట్టుమూర్తినిగా భ్రమించి యితని పాంచాలీపరిణయములోని యీక్రిందిపద్యమును

గీ. అల్లసానివాని యల్లిక బిగిసొంపు । ముక్కుతిమ్మనార్య ముద్దుబలుకుఁ
బాండురంగసుకవి పద్యంబు హొయలు । గాక మారిరాజు నీకె కలదు.

భట్టుమూర్తినిగూర్చి రామకృష్ణకవి పలికినట్లు చెప్పుచున్నారు. ఇది నామసామ్యమును బట్టి కలిగిన భ్రమగాని వేఱుకాదు. మఱియు నీపద్యమునుబట్టి యీకవి తెనాలి రామకృష్ణునికాలమునకుఁ దరువాతివాఁడనుట స్పష్టమగుచున్నది. పయిపద్యములో శ్రీరంగేశుఁడు తనకవిత్వమునుగూర్చి యట్లు పలికినట్లు చెప్పుకొనుటయే కాక రాజవాహన విజయములో సరస్వతిని ప్రార్థించునప్పుడుకూడ నిట్లు చెప్పియున్నాఁడు.—

ఉ. చోరు నలంక్రియావిహృతిసొంపు మయూరునిసౌరు మాఘునా
భారవికాంతిసంపదయు బాణగుణాఢ్యతరప్రయోగ మా
దారి మురారికోమలపదంబుప్రసాదముఁ గల్గునట్లుగా
భారతి యిచ్చెఁగాతఁ బ్రతిభారతి మత్కృతికిన్ మత్కృతిన్.

ఈతనికవిత్వమునం దీకవి పొగడుకొన్నంత యాధిక్యము లేకపోయినను, రసవంత మయి సలక్షణమయి యమకాది శబ్దార్థాలంకారయుక్తమయి కవితాగంగ యనర్గళ ధారగా ప్రవహించుచున్నది. గ్రంథములం దన్యదేశ్యపదములును వ్యాకరణలాక్షణిక సమ్మతములుకాని ప్రయోగములును కొన్ని యందందుఁ గానఁబడుచున్నవి. క్రీ. ౧౬౪౦ వ సంవత్సరప్రాంతముల యందుండి యుండెను. కాకమానిమూర్తి బహుళాశ్వ చరిత్రములోనివని కొన్నిపద్యములు రంగరాట్ఛందము నందును సర్వలక్షణసారసంగ్ర హమునందును ఉదాహరింపఁబడియున్నవికాని యితఁడు రచియించిన బహుళాశ్వ చరిత్రము నాకు లభింపలేదు. ఈమూర్తికవి రాజవాహనవిజయములో చంద్రగిరి హనుమంతుని స్తుతించియుండుటచేత నీతని వాసస్థానమైన కాకమానిగ్రామము చంద్రగిరిసమీపమున నుండియుండును. కవిత్వరీతిని దెలుపుట కీతని గ్రంథములనుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను.—

ఉ. సుందరుఁ గాంచె ద్విగ్రమణముఖ్యుఁడు వారణవేషభూషణున్
మందరకంధరాకనకమంజిమమధ్యవితర్ద్యమందపూ
రందరనీలకందరధుకంధరసింధురవైరిపీఠవా
సేందుకళాకలాపు హృదయేశ్వరుతోడుత నెత్తమాడఁగన్ —ఆ. ౩.

శా. నీకేవచ్చు సువాలముల్ ధవళమింతీ యల్లో నేరెళ్లు గా
రీకళ్యాణము లంచు నింటికడ నేకీలి న్విజృంభింతువే
వాకీ విచ్చుట యంచు నిద్దఱు సతుల్ వ్యాకోపవాక్యంబులన్
గాకై ముద్దలపట్టుసుం గొడఁగి రాకల్యాణవేదిస్థలిన్.—ఆ. ౪

శా. ఆఁడుంగావుచు గింటనున్న సతి నొక్రా లౌటయే మేలు నూ
ఱేఁడు ల్పెంచిన గోఁతు లేమి సతమా యీవిద్యలు లోకదరిన్
గాఁడంబల్కిన దాళఁగావలసెఁ గా కాఁగానిత్తిట్లాడికల్
నేఁ డీతంత్రియుఁ దల్లివంగడము కానీ సంచుఁ బోనాయెఁ గా.—ఆ. ౫.

## కామేశ్వరకవి.

ఇతఁడు సత్యభామాసాంత్వన మను నాలుగాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి, మధురనాయకుఁడైన ముద్దలగరన్నపాలున కంకితముచేసెను. ఈమధుర శ్రీకృష్ణుని జన్మస్థలమయిన మధురాపురముగాక పాండ్యమండలమునకు రాజధానియైన దక్షిణమధుర యైనట్లీక్రిందిపద్యమువలనఁ దెలిసికొనవచ్చును—

క. లక్షణలక్షితకమలా । వీక్షణపుంఖానుపుంఖవిభవోన్మేషా
నుక్షణతతవిశ్రుతియై । దక్షిణమధురాపురంబు దనరు ధరిత్రిన్

కృష్ణదేవరాయని యనంతరమునఁ దెలుఁగునాయకులు పాండ్యమండలమును చిరకాలము పాలించిరి. ఈకవి యాకాలమునందు మధురాపురమును బాలించుచున్న ముద్దళగరరాజు సభలోఁ గూర్చుండి తన్నుఁగూర్చి యిట్లుపలికినట్లీపద్యములలోఁ జెప్పినాఁడు—

శా. ఆరీతిన్ సభ ముద్దళగ్గరధరాధ్యక్షుండు కొల్వుండి తా
హేరాళంబుగ నయ్యెడ న్నడుచుసాహిత్యప్రసంగంబు గం
భీరప్రౌఢిమ వించు నన్బిలిచి నెమ్మిం బల్కె వీణాకన
ద్గౌరీపాణిసువర్ణకంకణరుణత్కారానుకారోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణయంబును మున్ హవణించి యార్యులౌ
ననఁ దనరించినావు మఱి నప్రతిమంబుగ నవ్యకావ్య మిం

పున రచియించుమీ సాగనుపోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వనము గప్పురంపుఁజలువం గెలువం దిరుకామపత్కవీ.

క. కాకులవలె నింటింటను । గాకవు లున్నారు హంసకైవడి భువిలో
శ్రీకామ నీకె తగురా । యేకడ నుడిపాలు నీరు నేర్పఱుపంగన్.

క. ఏభాష నైనఁ గృతిపతి । శోభనములు చెందు నీదుసూక్తులవలనన్
నీభాగ్య మసదృశము గా । రీభవకరుణావేశ శ్రీకామేశా.

ఈముద్దళగిరి తన సవతియన్న గాగయిన చొక్కనాథుఁడు స్త్రీలోలుఁడయి రాజ్య భారము తమ్మునిమీఁదఁబెట్టి తంజావూరిలోనున్న కాలములో యువరాజుగా రాజ్యము చేసెను. చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౬౬౦ వ సంవత్సరము మొదలుకొని ౧౬౮౨ వ సంవత్సరము వఱకును రాజ్యము చేసెను. కవి యీముద్దళగిరినే రాజునుగా వర్ణించినను, అతని వర్ణనలోఁ గల యీ క్రింది పద్యమునుబట్టి యన్న యుండఁగానే యితఁడు రాజ్యభారము వహించినట్లు స్పష్ట మగుచున్నది.—

ఉ. అన్నయు దమ్ము లీరణి నన్నలు నొద్దికరై యశోరమల్
చెన్నువహింప రాముకృపచేఁ దనుఁ జెందినరాజ్యసంపద
భ్యున్నతభోగభాగ్యుఁడయి యుర్విని సర్వనృపాలకోటిలో
నెన్నిక కెక్కె ముద్దళగిరీంద్రుఁడు తాను మహోన్నతస్థితిన్.

ఈముద్దళగిరి ౧౬౭౩ వ సంవత్సరప్రాంతమునఁ దానే రాజ్యము నాక్రమించుకొని సంవత్సరకాలము స్వతంత్రముగాఁ దనపేరనే పాలనముచేసెనుగాని యింతలో చొక్కనాథుఁడు వచ్చి దేశము మరల స్వాధీనము చేసికొనెను. చొక్కనాథుఁడును, ముద్దళగిరియు, మఱియొక్కరును ౧౬౭౩ వ సంవత్సరము మొదలుకొని ౧౬౭౯ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసి ప్రసిద్ధికెక్కిన తిరుమలనాయకుని కొమాళ్ళు. ఇందుఁ దెలుపఁబడినచరిత్రమునుబట్టి కవి యీగ్రంథము ౧౬౭౪ వ సంవత్సరప్రాంతమునందు రచించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతఁడు రుక్మిణీపరిణయమును గూడ రచియించినట్లు చెప్పఁబడినదిగాని యాపుస్తకము నాకు లభింపలేదు. „దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలకృష్ణకాంతకరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుళుచ్ఛసితచ్ఛత్ర చామరకళాచికా కనకాందోళికా విరాజోపచార" యని యాశ్వాసాంత గద్యమునఁ జెప్పుకొనియుండుటచేతఁ గవి తిరుమలనాయకునికాలమునందుసహితముండి ౧౬౫౦వ సంవత్సరప్రాంతమునుండి కవిత్వమునందుఁ బ్రసిద్ధిఁ గాంచియుండును. ఈగద్యమునందే యితఁడు „శ్రీకాళహస్తీశ్వరచరణారవింద మిళిందాయమాన జ్ఞానప్రసూనాంబికా కృపాలంబవిజృంభమాణ సారసారస్వత సుధాతరంగ" యని చెప్పుకొనుటచే నితఁడు

కాళహస్తినివాసుఁ డయి మధురనాయకులయాదరమువలన మధురసంస్థానమును జేరినట్టు కనఁబడుచున్నది. విజయవిలాసమువలెనే యిదియు శుద్ధ ద్రవిడదేశమునందుఁ జేయఁబడిన ప్రబంధము. ఇవిగాక యాదేశమునందుఁ జేయఁబడిన తెలుఁగుకావ్యము లింకను బెక్కులు గలవు. "వల్లకీవాదన ధురీణ వర్ణగీతాది గాంధర్వస్వరనవీనకల్పనా ప్రవీణ" యనియు గద్యమునందు కవి వ్రాసికొన్నాఁడు. అందుచేత నితఁడు సాహిత్యమునందుమాత్రమే కాక సంగీతమునందును బ్రవీణుఁడని విశదమగుచున్నది. ఈకవి యింటిపేరు లింగనమఖివారు; తండ్రిపేరు నాగనామాత్యుఁడు; తల్లిపేరు కామాక్ష్యంబ. ఈతనికవిత్వము ప్రౌఢమయినది. సత్యభామాసాంత్వనమునుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.—

ఉ. ఆపురమందుఁ గెంపుజిగియందపుఁగోట పయోధికన్యకున్
బ్రాపయి తమ్మిపోలికను భాసిలెఁ గొమ్మలు తేరు లట్లు చా
లై పరఁగెం దదంతరగళన్నవమౌక్తికలీల నబ్ధిపీ
చీప్రభుశీకరమ్ము లెగఁజిమ్ము హరిసేసలు చల్లుకైవడిన్.

ఉ. తావులవెంబడిం గదలి తారొక్కెడఁ దేఁటులుం దేఁటిబెండ్లలం
బోవక నాటెఁ బుష్పశరుఁ బుష్పడితోఁ దగెఁ బూవుసోఁన యా
పూవులసోఁకతో మిగులఁ బొల్చెను గల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనక వీచెను జల్లనికమ్మతెమ్మెరల్.—ఆ. ౧.

ఉ. చూడక చూచినట్లు తమి సోలుచు సొక్కుచు మోహ మెంచి మా
టాడక యాడినట్లు కలయం గమియించి మనం గణించి యా
చేడియతో విలోకమయి చింతిలి కార్యము నెంచకుండుటల్
పాడియె తెల్పుమా యనితపాండవ కాళియమౌళితాండవా.—ఆ. 3.

శా. భాసిల్లెన్ని సోవరేఖశుభగంభావక్రియావీక్షణో
ల్లాసోదారముకుందచారకృతలీలాలాస్యసాహస్యభృం
గీసంగీతతరంగితాబ్జరుచిభంగీజాతరంగోల్లస
త్కాసారాబ్ధితరంగజాలము శరత్కాలం బకాలంబుగన్.—ఆ. ౪.

## వెణుతురుబల్లి విశ్వనాథకవి.

ఇతఁడు శేషధర్మములను బద్యకావ్యమునుగా రచియించి పెద్దాపురసంస్థానాధీశ్వరుఁ డయిన వత్సవాయ తిమ్మనృపాలుని కంకితము చేసెను. ఇతఁ డాఱువేలనియోగి

బ్రాహ్మణుఁడు. ఈతని తండ్రి పేరు వేంకటామాత్యుఁడు. ఇతఁడు ౧౬౦౦వ సంవత్సర ప్రాంతములయం దుండినవాఁడు. ఈకృతిపతినిగూర్చియు కృతికర్తనుగూర్చియు నేమియు లక్షణకవిచరిత్రమునందుఁ గొంత తెలుపఁబడి యున్నది. ఇతనిది సలక్షణ మయిన మంచికవిత్వము. ఈతనిశేషధర్మములనుండి రెండుపద్యము లిందుఁ గైకొనఁబడు చున్నవి—

శా. మాయావిప్రుల కావ్యబంధు కడిగెన్ బాదాంబుజద్వంద్వముల్
చేయారం గుసుమాక్షతాదులను బూజించెం బాత్రము ల్వైచె న
ల్లాయాపాత్రములందు నన్నము లిడన్ నారంభుఁ డౌనంతలో
నాయింద్రుండు గృహస్థుఁబూని పలికెన్ సాక్షేపవాక్యంబుగన్.—అ. ౧.

ఉ. కాలినయొప్పగుండ్ల మఖగహ్వరభాగములందుఁ గ్రుక్కుచున్
సోలుపు లేర్పడ న్నెఱుఁగుసూనములు కన్నులఁ గ్రుచ్చుచుం దలల్
నేలనుఁ జేర్చి పాదములు నింగికి నెత్తుచుఁ బెక్కుజాడలన్
గాలభటు ల్వెతల్గుడుపఁగాఁ బడియుండుదు రంగమీఁదటన్.—అ. 3.



## నూతనకవి - సూరన్న.



ఈకవి సకలజనాభిరామ మను నామాంతరముగల ధనాభిరామ మను మూఁడా శ్వాసముల పద్యకావ్యమును రచించెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; తిప్పయామాత్యపుత్రుఁడు. కవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొనుచున్నాఁడు.—

సీ. విస్తీర్ణవైభ వాపస్తంబసూత్రుండఁ గాశ్యపగోత్ర విఖ్యాతయశుఁడ
ఘనత ననంతసేనాని మల్లయామాత్యపౌత్రుఁడఁ దిప్పయప్రభుసుతుండఁ
భాగ్వతీశుభగర్భపాథోనిధానసంధానశశిత్తుండ మానధనుఁడ
సత్కావ్యపాఠీన సాహస్యసంలబ్ధవిస్తారమతి గలవిమలయశుఁడ
భద్రవైభవశ్రీవీరభద్రలబ్ధ । జనితచాతుర్యకావ్యలక్షణవిచిత్ర
విపులవాచాసమగ్రసంపిద్ధమతిని । సూరనామాత్యనామక సుకవివరుఁడ.

కవి తనగ్రంథమున వ్రాసికొన్న యీక్రిందిపద్యమునబట్టి తాను దిక్కనసోమయాజి సంతతివాఁడనని చెప్పుకోఁదలఁచినట్లు కనుపట్టుచున్నది—

చ. ఆనపుగ భారతాంబునిధి యుర్వ్యలికిం దగనెట్టి యందులో
ఘనకవితామృతంబు చవి గాంచిన తిక్కన సోమయాజిపా
వనతర మైనయట్టికులవర్ధనుఁడై మహి పేరుగల్గు నూ
తనకవి సూరనార్యుఁడను ధర్మగుణాంచితపాలనీయుఁడన్.

ఈకవి తనకావ్యమును దాక్షారామభీమేశ్వరుని కంకితము చేయుటచేత నితఁడు గోదావరిమండలములోనివాఁ డయినట్టు కనఁబడుచున్నాఁడు. ఈతఁ డేకాలపువాఁడో తెలియ రాలేదుగాని పూర్వకవులను మధ్యకవులనుమాత్రము స్తుతించి చిమ్మపూడి యమరేశ్వరుని

చ. అలఘుని శబ్దశాసనపదాంకితుఁ దిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁ జె
న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథునిం
దలఁతు నపూర్వదివ్యకవితామహనీయసమగ్రచిత్తులన్.

అని కవిస్తుతిలోఁ జేర్కొనియుండుటచేతను, ఇంతమంది పూర్వకవులను జెప్పి మధ్యకవులలో నొక్కనిని జెప్పకపోవుటచేతను, ఇతఁడు మధ్యకవులలోఁ జేరినవాఁ డేమో యని సందేహము కలుగుచున్నది. అయినను స్వతంత్రము లైన యితరాధారములు లేక మధ్యకవులను జేర్కొనక పోయినంతమాత్రమున నితఁడు మధ్యకవి యని నిశ్చయించుటకు వలను పడదు. కాని యితఁ డిన్నూఱుసంవత్సరముల క్రిందటివాఁ డని యైనను జెప్పవచ్చునని తోఁచుచున్నది. ఈతఁడు రచియించిన ధనాభిరామము కథ కొంతవఱకు మనోహరముగా నున్నది. ఇంద్రసభామందిరమునందు మన్మథునకిని కుబేరునికిని రూప మెక్కువ యనియు ధన మెక్కువ యనియు వివాదము సంభవించి వారితగవు మాటలతో తెగనందున

చ. తరమిడి యిన్నిమాటలు వృథాపని లేదు సమస్తవైభవో
త్కర మగుదాక్షవాటిపురి గల్గు ధరాస్థలిలోనఁ బోయి నీ
నిరుపమరూపసంపదయు నేర్పుఁ జూపుము నేను వచ్చి యా
పురవరసీమఁ జూపెదను భూరిధనంబున నామహత్త్వమున్.

అని కుబేరుఁడు మన్మథునిఁ జూచి, మాటలతోఁ బ్రయోజనము లేదు. మన మిద్దఱమును భూమిమీఁద దాక్షారామములోఁ బుట్టుదము అక్కడ నీవు ముట్టమొదట నీసౌందర్యమును నేర్పునుజూపుము తరువాత నేను వచ్చి నాధనమహిమను జూపెదను. అప్పుడు మనయిద్దఱిలో నెవ్వరు బలవత్తరులో తేటపడి రూపమహిమ యెక్కువయినదియు ధనమహిమ యెక్కువైనదియు వెల్లడియగును' అని పలుకఁగా మన్మథుఁ డాతని

యాహ్వాన మంగీకరించి పూర్వకాలమునుండియు వేశ్యలచేఁ బ్రసిద్ధమయి నదాత్మపాటి కిఁ బోయి యందుఁ దన రూపవిశేషమును జూపఁగా నాట్యమునకయి భీమేశ్వర స్వామి యాలయమునకుఁ బోయిన సుగుణావతి యను నొక పణ్యయువతి యాతనిని గాంచి కామించి యింటికిఁబోయి యాతనిం దనయింటికిఁ దోడితెమ్మని తన చెలికత్తెను వేఁడుకొనఁగా నావయస్య

ఉ. అక్కట వానిపన్నె గలయట్టికులంబునఁ బుట్టి రూపుచే
నెక్కుడు భాగ్యసంపదల నెన్నికకెక్కినదాన వింతలో
నెక్కడివానికి న్వలచి తెయ్యనొ వానికులంబు విన్న వా
రొక్కట నవ్వరే విమవు ముత్పలలోచన నీకు ముక్కడన్.

ఉ. నిచ్చలు నిండి వల్లభులు నీకడ గానుగ లేక కానుకల్
తెచ్చి తమంతఁ గ్రందుకొని తేఁకువ మోసలఁ గాచుచుండఁగాఁ
జెచ్చెరవారలన్ ఘనము చేయక డాయక యూరకున్నచో
నొచ్చెనుకాదె నీకును బయోరుహలోచన యిప్పరంబునన్.

చ. కలికితలంబుమీఁ దఁగ వికారముతోడ మనోజకేళి ని
చ్చలుఁ దమకంబు పుట్టి విటసంఘము తెచ్చియొసంగునీమహో
జ్జ్వలమణిభూషణాదిఘనవస్తువు లొందుట కీర్తి గాక తా
వలచుట పంతమా ధరణి వారవధూమణికిం దలోదరీ.

అని యుపాయ ధనము నిచ్చెడు విటు లనేకు లుండఁగా ధన మియ్యఁజాలని క్రొత్త వానిని కేవలరూపసంపదను జూచి వలచుట వారకాంతకు ధర్మముకాదని బుద్ధి చెప్పియుఁ గార్యము గానక తుదకు మన్మథుని దానియింటికిఁ దెచ్చి యప్పగించెను. సుగుణవతియు మన్మథుఁడును గొంతకాల మీప్రకారముగా సుఖ మనుభవింపుచుండఁగా, కుబేరుఁడు యోగివేషము వచ్చి భీమేశ్వరస్వామియాలయమునఁ జేరి యచ్చటికి వచ్చెడు వేశ్యల కల్లను ధనమును చీరలును గొలఁగా నొసఁగసాఁగెను. అంత సుగుణవతి తల్లియు నొకనాఁ డచ్చటికిఁ బోయి యాతఁ డిచ్చిన కనకాంబరములను దెచ్చి కూఁతునకుఁ జూపి బోధించి మతివిచిత్ర రూపవంతుఁ డయినమారుని విడనాడి విత్తవంతుఁ డైనకుబేరునిఁ గూడుమని సుగుణవతి నొడఁబఱిచెను. అంతట మన్మథుఁ డోడిపోయి దేవాలయమునుచేరి భీమేశ్వరస్వామిని ప్రార్థింపఁగా నతఁడు సాక్షాత్కరించి, యొకప్పుడు ధనమును మఱియొకప్పుడు రూపమును విజయము నొందినను మొత్తముమీఁద ధనసౌందర్యములు రెండును సమానములే యని తెలియఁబలికి వారిరువురిని సమాధానపఱిచి వారి స్థానములకు వారిని బంపివేసెను. ఈపుస్తకము చిన్నదే యయినను, కవిత్వము

హృద్యముగానే యున్నది. శైలిని జూపుటకై ధనాభిరామమునుండి రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను.—

చ. మదమునిగాఁ దలంతు రిల మానవు లెల్లను, సత్కవీశ్వరుల్
పదపడి కర్ణుఁ డీతఁడని ప్రస్తుతిచేయుదు రాత్మలోపలన్,
మదనపరాతివర్గములు మారుగఁ గవ్వడి యండ్రు, భూజనుల్
మని దినవాథుఁ డందురు, సమస్తము ద్రవ్యముఖంబు చూచినన్.— ఆ. ౧.

ఉ. కమనీయంబుగ నాడఁ బాడఁ జదువంగా నేర్చు కీరాని వా
ద్యములన్నైపుణి సొంపుమీఱఁగఁ గళాస్థానాంగతంత్రంబులన్
సుమనస్స్ఫూర్తియు నోజకేళి విటులం జొక్కింపఁగా నేర్చు వి
భ్రమ సౌందర్యముల న్వహించు సరిచెప్పన్ లేరు నాపుత్రికిన్.— ఆ. 3.



## సముఖ వేంకట కృష్ణప్పనాయకుఁడు

ఈకవి యహల్యాసంక్రదన మనుమూడాశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇతఁడు శూద్రకులజుఁడు; సముఖమీనాక్షినాయకుని కుమారుఁడు. "శ్రీమత్పాండ్య మండలాధీశ్వర విజయరంగచొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజ తురంగమాందోళికా చ్ఛత్రచామరవిజయ దోహళకాహళభూరిభేరీ బిరుదధ్వజప్రముఖ నిఖిలసంపత్పారంపరీసమేత' అని యాశ్వాసాంత గద్యమునందుఁ జెప్పుకొనుటచేత కవి మధురాధినాథుఁ డగువిజయరంగ చొక్కనాథుని కాలములో నున్నవాఁ డగుట స్పష్టము. ఈవిజయరంగ చొక్కనాథుఁడు క్రీస్తుశకము ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకు పాండ్యమండలాధీశ్వరుఁడుగా నుండెను. కాఁబట్టి కవియు ౧౭౨౦ సంవత్సరప్రాంతములయందు యున్నవాఁడే. ఇతఁడు జైమిని భారతమును వచనకావ్యముగా రచించినట్టు యహల్యాసంక్రందనములోని యీక్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

గీ. సముఖమీనాక్షినృపగర్భవిమలజలధి। చంద్ర వేంకటకృష్ణేంద్ర శౌర్యసాంద్ర
మునుపు జైమినిభారత మనఘ వచన। కావ్య మొనరించినట్టిసత్కవివికాంత.

ఈకాలమునందే మంచికవులచేత తెలుఁగున వచనకావ్యము లారంభింపఁబడినట్టు వినఁబడుచున్నవి కాని యావచనకావ్యము లిప్పుడు కానరావు. తారాశశాంకమును రచించిన శేషము వేంకటపతి యీకవికాలమునం దుండినవాఁడు. కవితాను "పురోహిత

భృత్యామాత్య సామాజిక బంధువర్గంబులు కొలువం గూరుచుండి యుభయభాషాకవితా విశేషుండై శేషము వేంకటపతికవీంద్రుం డాప్తసఖుండు గాఁ బిలిపించి నపు డతఁ డీక్రిందిపద్యమును జెప్పెనఁట—

చ. నల నాసత్య వసంతులం గెలుచుసౌందర్యంబు ధైర్యంబు దో
ర్బలముఁ ద్యాగమహిమానువృత్తి దమయున్ బ్రాభవత్వము న్విద్యయున్
వెలయన్ బాల్యమునందె నీవు మధురోర్వీనాథు మెప్పింపవా
ఒలిగా వేంకటకృష్ణనావరసుధీ భాషాఫణిగ్రామణీ.

అహల్యాసంక్రందనములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. బంటుతనంబు లాడుకొని పాఱిన రావణుచేతఁ బెట్టుకన్
గంటికి నీరు గ్రమ్మఁగ నిలంకను బట్టి పాఱెన నీదుతండ్రి నీ
యింటను లేదు పౌరుషము మిక్కిలి తప్పు బిరానములేల చేతివా
లంటను గోడెకాఁడ మిము గంటఁగ వెంటనె చంపఁగా నెఱదన్.—ఆ. 1.

ఉ. ఆతతి నాలతాంగిని మహోగ్రహదృష్టిని జూచి యోసి నీ
చేతిజలంబు లంట నినుఁ జెల్లునె యొంటిజంత వేఁగ లా
రాతిని గూడి తీవిపులు గాతిజామునఁ గావుమన్ బలా
రాతికి నేమనున్ మునిరాజముఖిన్ సుముఖిన్ శపింపఁగన్ —ఆ. 3

రేపనూరి — వేంకటపతి.

ఈకవి విష్ణుమాయావిలాసమను మూఁడాశ్వాసముల పద్యకావ్యమును రచియించి దానిని వేంకటగిరిసంస్థానప్రభువయిన శ్రీవెలుగోటి బంగారు యాచమనాయని కంకితము చేసెను. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; లింగనామాత్యుని పౌత్రుఁడు; గంగనమంత్రి పుత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు. కృతిపతి తండ్రియైన కుమారయాచభూపాలుఁడు తనకు "తిక్కయ్య" యను బిరుదము నిచ్చినటు కవి యీపద్యమునఁ జెప్పికొన్నాఁడు—

మ. ఘను శ్రీనూపతిలింగపావభజనానందన్ గుమారేచభూ
జనపాలాగ్రణి తిక్కయాఖ్యయనుచుం జాలంగఁ బేరిచ్చి ప్రో
చినఁ బెంపొందినరేపనూరికులుఁడన్ శ్రీవేంకటాఖ్యుం గృపా
ఘనగంభీరశుభైకదృష్టి వెలయంగాఁ జూచి పల్కెం దగన్.

కృతినాయకుఁడైన బంగరుయాచమనాయఁడు ఔరంగజేబు ఢిల్లీచక్రవర్తిగానున్న కాలములో ౧౬౯౫ వ సంవత్సరమునందు వెల్లూరినబాబగు జుల్ఫఖారుచేఁ జంపఁబడినందున, ఈపుస్తకము ౧౬౯౦ వ సంవత్సరప్రాంతములయందు రచియింపఁబడినదని చెప్పవచ్చును. వేంకటగిరిసంస్థానప్రభువు లనేకులు తెలుఁగుభాషయందు దక్షిమానము గలవారయి కవులను బ్రోత్సాహపఱిచి తామనేక ప్రబంధములకుఁ గృతిపతు లయిరి వీరు పద్మనాయకవంశజు లయినవెలమలు. ఈసంస్థానమును స్థాపించిన మూలపురుషుఁడు బేతాళనాయఁ డనబిరుదనామము గల చెవిరెడ్డి యనెడు చేయూరి పోలిరెడ్డికుమారుఁడు. ఇతఁడు తననివాసస్థలమైన యనుమనగల్లుగ్రామమున రేవగ్గ యాచెఁడు (ఏచెఁడు) అను మాలవానిచేతఁ దనపొలమును దున్నించుచుండఁగా నాగటికఱ్ఱ కొకరాగిశాసనము తగిలెను. దానిని జదివిచూడఁగా నందు „నాగభైరవపొలము" అనెడి యాచోట తొమ్మిదిలక్షలధనము భూస్థాపితమయి యున్నదనియు, నరబలి యిచ్చినపక్షమున బలియిచ్చినవాని కాధనము దక్కు ననియు, వ్రాయఁబడియుండెను. అతఁ డప్పు డేమిచేయుటకును తోఁచనివాఁడయి యేచనితో నాలోచింపఁగా, వాఁడా స్థలమునందుఁ దనయిటిపేర నొక గ్రామముకట్టించి తనయింటిపేరును గోత్రముగాఁ బెట్టుకొని వంశమునందుఁ బుట్టినపురుషులు కెల్లను దనపేరుపెట్టుచు వివాహము చేయవలసి వచ్చినప్పుడెల్ల ముందుగాఁ దనకులజులలో నొక్కనికి వివాహముచేయుచు వచ్చుట కంగీకరించినపక్షమునఁ దాను బలియగుట కొప్పుకొనెద నని రెడ్డితోఁ జెప్పెను. చెవిరెడ్డియు వాఁడు కోరనియమముల కన్నిటికి నొప్పుకొని యప్పుడే వాని న్నాపొలమునకు బలిపెట్టి యానిక్షేపమును స్వాధీనము చేసికొనెను. తరువాత నతఁ డాక్షేత్రమున రేచెర్లయను గ్రామమును గట్టించి, ఆ గోత్రమును రేచర్ల వారని మార్చుకొని, ఆయూరువిడిచి పిల్లలమఱ్ఱి యను గ్రామముచేర యాచోటు నివాసముగాఁ జేసికొనెను. ఈ గ్రామమునందు నతఁ డొకనాఁడు రాత్రి చీఁకటిపడువఱకును పొలములోఁ బనిచేసి యింటికి వచ్చుచుండఁగా దారిలో నురుములతోను మెఱుపులతోను గొప్ప వాన వచ్చెను. ఆవానలో నతఁ డొక మఱ్ఱిచెట్టుక్రిందికిఁబోయి నిలువఁబడియుండఁగా, చెట్టుమీఁదినుండి యొకభూతము దిగివచ్చిన ట్లాతనిదృష్టికిఁ గనఁబడెనఁట! అతఁ డెంతమాత్రమును జడియక చేత ఖడ్గముధరించి యెదురుగా నడువఁగా, ఆతని ధైర్య సాహసములకు మెచ్చి యాబేతాళుఁడు చెవిరెడ్డియు నాతని సంతతివారును శౌర్య సామ్రాజ్యైశ్వర్యవంతు లగుదురనియు శత్రులతోడి యుద్ధములో నెల్ల దానువోవ్వడి వారికి జయము కలిగింతు ననియుఁ బలికిన ట్లాతనిచెవులకు వినఁబడెనఁట! బేతాళుఁ డాతనికిఁ బ్రత్యక్షమయి వరములిచ్చె నన్నవార్త దేశమునందంతటను వ్యాపించి యు

చిరకాలములోనే కాకతీయప్రభు వయిన గణపతిరాజు చెవిసోఁకఁగా, అతఁడా చెవిరెడ్డిని తనరాజధాని యైన యోరంగల్లునగరమునకు రప్పించి లక్షరూపాయలువచ్చు గ్రామము లిచ్చి తనవద్ద సేనాపతినిగా నియమించి "పిల్లలమఱ్ఱి బేతాళనాయఁడు" అన్నబిరుదునిచ్చి గౌరవించెను. ఇది ౧౨౫౦ వ సంవత్సరప్రాంత మయియుండును.

ఈతఁడు చేసినని యమములను ననుసరించి యీతనివంశమువారు నేటివఱకును యాచనామమునుగూడఁ దమపుత్రులనామమునకుఁ జేర్చుచు, తమయింట వివాహము జరుగుటకు ముందుగా నొకమాలవానికిఁ బెండ్లి చేయుచు, పూర్వ మర్యాదను జెల్లించుచున్నారు. చెవిరెడ్డియొక్క ద్వితీయపుత్రుఁ డయిన ప్రసాదాదిత్యనాయఁడు గణపతిరాజుయొక్క మరణానంతరమునం దాతనిభార్యయును బుత్రికయును సహాయుఁ డయియుండి రాజ్య మన్యాక్రాంతము కాకుండఁ గాపాడి కాకతిరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్యుఁడని బిరుదందెను. చెవిరెడ్డియింటిపేరు రావువారు. ఈరావువారు మొదట నోరుగల్లురాజ్యముననేయుండి పేరొందిరి, తరువాతఁ దమపౌరుషమువలన సస్యభూము లాక్రమించుకొని సంస్థానప్రభువులయిరి. ఈవంశమువారిలో నొకఁ డగు తిరుమలనాయఁడు కృష్ణదేవరాయలరాజ్యకాలములో వెలుగోటిరాజ్యమును సంపాదించి వెలుగోడుపట్టణము తన రాజధానిగాఁ జేసికొన్నందున, ఆతనివంశమువారిప్పటికిని యు వెలుగోటివా రనఁబడుచున్నారు. విష్ణుమయావిలాసకృతిపతియొక్క తాతయైన పెదయాచమనాయఁ డావలి కన్యాక్రాంతమయిన వేంకటగిరిపురము మరల స్వాధీనపఱచుకొని దానిని స్వరాజధానిని జేసికొనఁగా నాటినుండియుఁ దత్సంతతివారి కదియే రాజధానిగా నున్నది. చెవిరెడ్డివంశజులలో నొకఁడగు సర్వజ్ఞ సింగమనాయఁడు బమ్మెర పోతనామాత్యునివలన నుద్దండభోగినీదండకమును శ్రీనాథునివలనఁ గొన్నికృతులను బొందుటయేగాక తాను పండితుఁడయి సింగభూపాలీయ మను నలంకారశాస్త్రము మొదలగు సంస్కృతగ్రంథములను సహితము రచించెను. ఆతనివంశజులలో నొకఁ డగు రాయపనాయఁడు ౧౬౦౦ వ సంవత్సరప్రాంతములయందు భాగవతీపరిణయము కృతినందెను. ఈవెలుగోటివా రిప్పటికిని తెనుఁగుకవుల నాదరించుచున్నారు. కవిత్వకీర్తి తేటపడుటకయి విష్ణుమయావిలాసములోని రెండుపద్యముల నుదాహరించుచున్నాను—

చ. ఇటువలెనేమి యాపయుః మిట్టిదు మీ రఖిలేశ మాయలన్
బటువగు విష్ణుఁడంచు నెడుపల్కులు సిద్ధము సుందరీ! కిటూ
కుటిలశిరోజ యైన హరి గొబ్బునఁ జూచితి రేని మీకు నొ
క్కటఁ జపలత్వ మైతఱి గౌరవ మెట్లగునో తలంపుఁడీ.—ఆ. ౧.

చ. వనయువతీవసంతులవివాహమహోత్సవవేళ నెమ్మనిం
దనరు కుతూహలంబున లతాలలనల్ కరపల్లవంబులన్
ఘనముగ సేసవెట్టుటకుఁగా ధరియించినమౌక్తికంబులో
యన విలసిల్లె నెల్లెడ సుహామకుమారకకోరకావళుల్. — అ 3.



## పైడిమఱ్ఱి - వేంకటపతి.



ఈకవి చంద్రాంగదచరిత్ర మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించి యున్నాఁడు. ఈగ్రంథకవిత్వము మిక్కిలి ప్రౌఢము నయి సరసమునయి పూర్వకవుల రచనను బోలి హృదయాహ్లాదకర మయినదిగా నున్నది. ఇతఁడు తనగ్రంథమును శ్రీరామాంకితము చేసియుండుటచేఁ గృతిపతినిబట్టి యీతనికాలనిర్ణయము చేయుట కాధారము కానఁబడలేదు. ఉన్నయాధారమంతయు కృతికర్త తనవంశవర్ణనము చేసికొన్న యీక్రిందిపద్య మయియున్నది—

సీ. సకలసత్కవిశ్లాఘ్యసుకవిత్వసామ్రాజ్యనిర్వాహకుఁడు పెద్దపర్వతన్న
వివిధభాషావార్యవిరచనాచాతుర్యసర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యదాకార వాచాచమత్కారనిరుపమమతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్భకవితాచ్ఛపందర్భకీర్తిసంప్రజ్ఞుండు కేశవన్న
దనుజులన్నలు గాఁగను దనరుకృష్ణ। రాయభూషణకులరామరాజతనయ
కేశవాత్మజ పర్వతాఖ్యసుతుఁడ వేంక। టాద్రి నిదె కవ్య మేఁ జేస్తి నంకితముగ.

ఇందలి పేరులనుబట్టియు కవికాల మిది యని నిశ్చయించుట కాధారము దొరక లేదు. ఇందు కృష్ణరాయభూషణ యను పద ముండుటనుబట్టి కర్నల్ మెకంజీదొరగారు సంపాదించిన లిఖితపుస్తకములపట్టికలో కవి కృష్ణదేవరాయలకాలములోనివాఁ డని చెప్పఁబడి యున్నది. ఇటీవల బ్రౌన్‌దొరగారు నిర్ణయించుటవలనం దీకవి యాధునికుఁ డని వ్రాసియున్నారు. పయిపద్యములో నున్న కృష్ణరాయభూషణశబ్ద మొకటికి కృష్ణదేవరాయనియాస్థానమున కలంకారముగా నుండుటచేతనే వచ్చినను, ఈకవి కృష్ణరాయభూషణుని వంశజుఁ డగు రామరాజుకొడుకైన కేశవార్యునిపుత్రుఁ డగు పర్వతాఖ్యునిసుతుఁ డగు వేంకటపతి యగుటచేఁ గృష్ణదేవరాయని యనంతరమునఁ బెక్కుతరములు గడచినతరువాత నున్నవాఁ డగుట స్పష్టము. అప్పకవి యీచంద్రాంగదచరిత్రములోనిపద్యముల నుదాహరించి యుండకపోవుటచేత నీకవి ౧౬౫౦ వ సంవత్సర

మునకుఁ దరువాతివాఁ డనియు నూహింపఁ దగియున్నాఁడు. అందుచేత కవి ౧౭౦౦వ సంవత్సరప్రాంతముల యం దున్నవాఁ డని తోఁచుచున్నది. చంద్రాంగదచరిత్రము నుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాము —

ఉ. అప్పచు లాడుచున్ నగవు లాడుచు బారలు సాఁచిసాఁచి మా
యప్పలు వచ్చి రంచు సకియల్ కనుదమ్ములు మోడ్చి పిల్వఁగా
నుప్పనఁ దప్పుతప్పటడుగుల్ నడలం గొమరుండు పైఁబడుం
దప్పక చూచు తల్లికిని దండ్రికి నచ్చట తీఱునట్లుగన్. — ఆ. ౨.

మ. హరిమోలం గదుపోటు బంటు నయి గర్వాలాపము ల్మన్న స
త్వరతం బల్కుటెఁ గొన్ని నోళ్లఁదల్ తథ్యంబు నేఁ డన్నియున్
బరగం బందకుఁ జెప్పుసాధనగతిన్ బాటిల్లె వ్యర్థంబులై
సురలోకంబున కేగు టెట్లు నవయుద్ధ ల్పన్నల న్నవ్వఁగన్. — ఆ. ౩.

సీ. భుజగలోకాధీశ భోగతల్పశయాన హరిరూపధర మహాపురుష యనుచు
నకులారసుకుటవర్తితపాదరాజీవ రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచమదభంగ మహితపాంచజన్యాస్త్ర శరదనిద్రితనేత్ర శౌరి యనుచు
సముదగ్రవర్గావసరయోగనిద్రాణ కరిగాఁ వరద శ్రీకాంత యనుచుఁ
దలఁకు నులుకును నలుకు నుగ్గిలుచుఁ బలుకు । సఖులనయనస్వరశిరోజచరణకలన
పవనశంపిగ్రఘనహంస వసతులగు । భటులటప్రియసముదాయపటిమదోఁ । ప.ఆ.౪.

ఉ. ఓరిమృగాంక నాఁడడుకు నోడిన రాహువు కిన్క నంకమున్
ద్వేష విసంబు నీయెడలఁ గరంగ గొరలక్కొని నక్కొడు
ర్వ్యాగరిత్వదీయకిరణావళిపంబుల నొంచసాగెఁ బె
న్వేగముఁ [illegible] [illegible] నీదగు చేతఁగాఁ జూడ కమ్మెయిన్. — ఆ. ౫.

## వెలగపూండి కృష్ణయ్య.

ఈకవి భానుమద్విజయ మనెడియైదాశ్వాసముల ప్రబంధము రచియించెను. మఱియు నితఁడు మాలతీమాధవీయమును, గౌరికాశాస్త్రము, చతుర్విధకందశతకము, అను పద్యకావ్యములను, వేదాంతసారసంగ్రహ మను వచనకావ్యమును, రచించినట్లు భానుమద్విజయములోని యీక్రింది పద్యములోఁ గవి చెప్పుకొనియున్నాఁడు—

సీ. మహిలోనమాలతీమాధవీయ మనంగ శృంగారకావ్య మొసంగఁజేసి
గౌరికాశాస్త్రంబు కమలోకహితముగా నెనయ నేకాశ్వాసమున రచించి

షట్చక్రములఁ గందపద్యపుశతకంబు నాల్గుయోగంబుల ననువుపఱచి
సమస్తవేదాంతసారసంగ్రహశాస్త్ర మమరంగ వచనకావ్యం బొనర్చి
చాటుకృతులను మఱికొన్ని సంఘటించి। మాతులాంకితమొనరించి మించిపుణ్య
శాలియనఁ గీర్తిఁ గైకొన్న సత్కవీంద్రు। మధురవాక్సాంద్రుఁ డక్కయామాత్యచంద్రు

పూర్వ మీతనివంశపువారు గాంగేయోపాఖ్యానము, సుమంతోదయము, ఆంధ్రకర్ణామృతము, వజ్రభుజోపాఖ్యానము, సేతుమాహాత్మ్యము, దత్తాత్రేయచరిత్రము, మర్యాదరామసచివచరిత్రము, మొదలగుగ్రంథములను రచియించియుండినట్టును కవి యీక్రింది పద్యములతోఁ జెప్పియున్నాఁడు—

క. భూనుతగాంగేయోపా। ఖ్యానసుమంతోదయాంధ్రకర్ణామృతముల్
మానితవజ్రభుజోపా। ఖ్యానము శుభహేతుసేతుమాహాత్మ్యంబున్.

క. దత్తాత్రేయచరిత్రన్। సత్తగు మర్యాదరామసచివచరిత్రన్
బిత్తరపుఁ గృతులు చేసిన। యుత్తమకవు లెల్ల మాకులోద్భవు లెందున్.

ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు, లోహితసగోత్రుఁడు; వెల్లపూడి నారసింహార్యపౌత్రుఁడు; నరహరిమంత్రి పుత్రుఁడు. ఈకవి పాండ్యమండలాధీశ్వరుఁ డైనవిజయరంగచొక్కభూపాలుని దండనాథుఁ డగుసాంబయామాత్యుని పుత్రుఁ డగుగోవిందయామాత్యునికి మేనమఱఁది యైన ట్లీక్రిందిపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. పాండ్యభూమండలాఖండలుం డైనవిజయరంగచొక్కభూజాని కప్త
మండనుం డగుసాంబదండనాథాగ్రణితనయులలో మేటిదండి యగుచు
సంగీతసాహిత్యసంస్కృతాంధ్రకవిత్వసరసజ్ఞుఁ డై మేనమఱఁది యగుచుఁ
గామ రొప్పుచుండెడుగోవిందయామాత్యుఁ డనుపమవిద్యాధికార్యసభను
నిండుకొలువుండె నపుడు నే దండఁ జేరి। సారసల్లాపముల మీఱి చతురమతిని
దక్షిణామూర్తికృపఁ బ్రత్యక్షమగుచుఁ। గృతిపతిత్వంబుఁ గోరుసంగతిని దెలుప.

ఇందుఁ జెప్పఁబడిన విజయరంగ చొక్కభూపాలుండు దక్షిణమధురాపురము రాజధానిగా పాండ్యమండలమును క్రీస్తుశకము ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును పాలించిన ట్లీవఱకే చెప్పఁబడెనుగదా? అందుచేత నీ కృష్ణకవియు నాకాలపువాఁడే యని వేఱుగఁ జెప్పనక్కఱలేక యే తెలిసికోవచ్చును. కవి సాంబదండనాథుని వర్ణించుచు

సీ. సరిబేసిసూర్యకోటిసాదులాఖాయుతో ఘటియించె నెవ్వాఁడు ఘనతమీఱఁ
శ్రీరంగజామాతృవేషవాల్యానందరావును నెవ్వాఁడు రహి నడంచె

. మయినూరినంజరాజయుగరి ప్రియవాక్యసంధికి నెన్నాఁడు శక్తి దాల్చె
* * * సదుపకారి శ్రీవళహస సాంబశౌరి.

అని యతఁ డార్కాటినవాబగు సాదతుల్లాఖాను మొదలగువారి నోర్చినట్లు చెప్పియున్నాఁడు. ఈసదతుల్లాఖాను ౧౭౧౦ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౨ వ సంవత్సరమువఱకును నవాబుగానుండి యార్కాటురాజ్యము చేసెను. కాఁబట్టి కవి ౧౭౨౦ వ సంవత్సరప్రాంతమునందు మధురాపురములో భానుమత్పరిణయమును రచియించియుండును. ఈతనికవిత్వము రసవంతమైనది. కవితాధోరణి తెలియుటకయి భానుమత్పరిణయములోని రెండుపద్యముల నిం దుదాహరించుచున్నాను—

ఉ. ఏమియు లేనివారలె యహీనమతిప్రభవు లందుచుండఁగా
భూమిపతిత్వ మొందినప్రభుల్ వ్యసనంబులఁ గాంచుటబ్రమేని
యేమయిన న్సమేతధృతి నేర్పడఁ బూని సమస్తకార్యముల్
తాము వహించిచూడవలె ధాత్రి నరాజక మౌను భూవరా.—ఆ. ౨

మ. గిరులం బాఱిసియే బలల్లుగ వదిం గీలొక్కన్నకన్నీరు లా
గురువక్షోరుహతారహారములతోఁ గూడం బ్రకాశింప నా
ధరణీశాంగన దస్రహోత్రగతసంతాపంబుచే నేడ్చె భా
స్వగవాసంతికికీస్వరాకలితవాచామాధురీవైఖరిన్.—ఆ. ౪

## శేషము – వేంకటపతి

ఇతఁడు శశాంకవిజయ మనెడి యైదాశ్వాసముల శృంగారప్రబంధమును జేసి వంగలసీతయార్యున కంకితము చేసెను. శశాంకవిజయమునకు తారాశశాంక మని నామాంతరము గలదు. ఇందుఁ జంద్రుఁడు బృహస్పతివద్ద విద్యాభ్యాసమునకయి చేరి గురుపత్నియగు తారనింటినుండి లేవఁదీసినకథ మిక్కిలి పచ్చిగా వర్ణింపఁబడినది. ఈశేషము వేంకటపతి నియోగిబ్రాహ్మణుఁడని తోఁచుచున్నది. ఇతఁడు కందాళరామానుజాచార్యుని శిష్యుఁడు; కృష్ణయార్యునికుమారుఁడు. కృతినాయకుఁడు తన్నుఁ బిలిపించి పలికినట్లు చెప్పఁబడిన యీక్రిందిపద్యములలో కృతిపరంపరలు చేసినట్టు కవి చెప్పుకొనుటయేకాని యొక్కగ్రంథమైనను బేరొక్కనియుండ లేదు.—

క. ననుఁ దుంగేశ్వరపదయుగఘనతరభజనానిరూఢకవితాసామ్రా
జ్యుని శేషముకృష్ణసుధీతనయుఁ బిలిపించి పలికె దయ వారక ,

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁ గాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికుల కింపుగాఁ గృతిపరంపరలన్ రచియించి కీర్తిచే
నెసఁగితివయ్య వేంకటపతీ బళి శేషమువంశసత్కృతీ.

ఈకవి పాండ్యమండలాధీశ్వరుఁ డైన విజయరంగ చొక్కనాథుని కాలములో నున్న ట్లీవఱకే సముఖ కృష్ణప్పనాయకునిగూర్చి వ్రాయునప్పుడే చెప్పఁబడెనుగదా! కవియు తారాశశాంక కృతినాయకుఁ డైన వంగల సీనయామాత్యుని వర్ణించుచు, అఖండమండితమహీమండలమండనాయమానపాండ్యమధురాధరాఖండల శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కృపాకటాక్ష వీక్షణానుక్షణ వర్ధమాన.........నిఖిల సంపత్సం పరాకంపితనిలింపనాయకుండని యిట్లొక విశేషణమును ప్రయోగించియున్నాఁడు. మఱియు ద్వితీయాశ్వాసారంభమున

క. శ్రీవిజయరంగచొక్క క్ష్మాపుని గురుప్రసాదసంపన్నాత్మా
శ్రీ వరదాచార్యమణీ! శ్రీవరదాసైకకృత్యా సీనామాత్యా.

అని కృతిపతిని సంబోధించియున్నాఁడు. దీనినిబట్టి కవి విజయరంగచొక్కనాథుని కాలములో మధురలో నుండుట నిశ్చయ మగుటచేతను, ఆరాజు ౧౭౦౪ వ సంవత్సరము మొదలుకొని ౧౭౩౧ వ సంవత్సరమువఱకును రాజ్యముచేసినవాఁ డగుటచేతను, శేషము వేంకటపతి యాకాలమునం దున్నట్లు స్పష్ట మగుచున్నది. అక్కడక్కడ క్త్వార్థక సంధి మొదలయిన కొన్ని లక్షణదోషము లున్నను, కవిత్వము మొత్తముమీఁద ద్రాక్షాపాకమయి మిగుల రసవంత మయియున్నది. చక్కెర మెత్తిన విషమువలె నీతిమాలిన యీకథ మనోహరము లయిన తేటమాటలతో నిండుగా చెప్పఁబడినందున, అనేకులయిన యౌవనపురుషుల నాకర్షించి పాడుచేయుచున్నది. దుర్నీతిని వర్ణించునప్పు డీకవి తనయనుమతిని దెలుపువాక్యముల నెక్కడను ప్రయోగింపక, „లోకములోఁ గొంద ఱబలల్.........తాటాకులలోన వ్రాసి పరాంగనఁగూడిరఁ బాపమంచు," „ఎన్ని పువ్వులన్ వ్రాలదు తేఁటి యట్లు మగవాఁ డనువానికి దోస మున్నదే" యిత్యాదివాక్యరత్నములచేత వలపుగలచోటఁ గలయుటయే పరమార్థ మన్నట్టు తెలిపి పామరులను భ్రమింపఁ జేసియున్నాఁడు. అందును మంచిదని సాధించుటకు సహితము మనవారికి పురాణములనుండి దృష్టాంతములు తండోపతండములుగా దొరకు ననుట క్రిందిపద్యము నిదర్శనముగాఁ జూపవచ్చును—

సీ. కన్నకూఁతు రటంచు నెన్నక భారతీరమణిఁ గూడఁడే నీపితామహుండు
మేనత్త యనుమేర మీఱి రాధికతోడ నెనయఁడే నిన్న నీయనుఁగుబావ

మీఁద సిగ్గులేక సుగుణు విరులవాన గు-సిరఁట!

చ. అమరులతోడ నప్పు డని రబ్జభవుండు భవుండు సద్గురుం
బ్రమదము మీఱఁగాఁ బిలిచి మావచనంబునఁ దారఁ జెందుమీ
రమణి కశుద్ధిలే దమృతరశ్మి నిఁ బొందుటచేత దాన నీ
కోమ పరిశుద్ధిఁ గాంచెఁ గయికొమ్మనఁ గొమ్మ గురుండు చేకొనెన్.

దేవతలును బ్రహ్మరుద్రులును గురునిఁబిలిచి వ్యభిచారదోషము లేకపోవుటయేకాక యమృతరశ్మి నిఁ బొందుటచేతఁ దార పరిశుద్ధురాలయ్యెనని చెప్పి యొప్పగించిరఁట.

ఉ. తత్సమయంబునన్ శశి ముదంబున నచ్చటి కేగుదెంచి పు
త్రోత్సవ మాచరింప విని యుద్ధతితో గురుఁ డడ్డువచ్చి య
మ్మత్సరుఁ డీబుధుం డిట నిశాకర రాఁ గత మేమి నీ కన
న్మత్సరబుద్ధి వారికిఁ బునఃకలహంబు జనించె నయ్యెడన్.

ఆపతివ్రతాతిలకమునకు పుత్రుఁడు పుట్టఁగానేవచ్చి చంద్రుఁడు పుత్రోత్సవ మాచరించి నప్పుడు గురు శిష్యులకు పునఃకలహము జనించెనఁట!

క. నావిని యజుఁ డోహోహో! మీవాదము చాలుఁ గుముదమిత్రునిపుత్త్రుం
డీవత్స మితనిఁ జంద్రుని! కీ విమ్మా వలదు విరస మిఁక నాంగిరసా.

అని బ్రహ్మదేవుఁ డంటిమునకికి బుద్ధిచెప్పి శిశువును తేఁగమునకిప్పించి వివాదము తీర్చెనఁట! ఈవిషయమునే చెప్పుచుఁ గాశీఖండములో

గీ. చదివె గురునొద్ద ధర్మశాస్త్రంబుఁ దొల్లి తఁ! బరమవిశ్వాసతాత్పర్యభక్తిగరిమఁ
జదివెఁ జంద్రుఁడు కామశాస్త్రంబుపిదపఁ! దలిరుపాయ్పన ననురక్తిఁ దారయొద్ద.

సీ. భువనైకధన్వి చేఁ బుష్పాయుధునిచేఁ బ్రసవాస్త్రుఁడన నేటు పడనివాఁడు
నతిగాఢ మైత్రో ధ్వాంధకారంబుఁ గన్నుల నంధుండు గానివాఁడు
నిశ్న బంధనలో భద్రాభరంబునఁ బారవశ్యంబుచేఁ బడనివాఁడు
లక్ష్మీకటాక్షవిలాసదుర్మదమున మదములోపల నన్ను గొననివాఁడు
లేఁడు భూపతి గలిగెనే న్వాఁడు నృపుఁడె! విశ్వధాత్రీజనులపాలి వేల్పు గాక
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు! నంతరరులను వర్జింప నలవికాదు.

ఈవిధముగా శ్రీనాథుఁడు చెప్పినరీతి ప్రౌఢవాక్యములు గాని, పురూరవశ్చరిత్రములో

క. పాపపరాఙ్ముఖతామతి! దీపాంకుర మానెలంతదీర్ఘశ్వసితా
టోపమున ద్ధతి నడఁగి ని! బ్రాపితమోహాంధకారబంధురుఁ డయ్యెన్.

సీ. లలనాలితంబుమండలముపై మచ్చలదళములు రచియింపఁ దలఁచుఁగాని
తరుణికెమ్మోవిమీఁదఁ బ్రవాళమణిసొంపు గులుకఁగా ఘటియింపఁదలఁచుఁగాని

జలజాక్షికుచకుంభములమీఁద శశిపుత్రంబుఁ దా నొనరింపఁ దలఁచుఁగాని
మృగరాజమధ్య నెమ్మేను లతావేష్టితంబుఁ జేయఁగాఁ దలఁచుఁగాని
తలఁపఁ డెప్పుడు గురువనితాసమాగమాగతాత్యఘదురితదవానలంబు
దుస్సహం బని కటకటా తొగలఁ డేఁడుగదా వివేకంబు కాముకులకు?

సీ. సకియకౌనుఁ దలఁచి సన్మార్గ మనుఁగాని యింతిదుర్మార్గత నెంచఁడయ్యెఁ
జెలువచన్నవఁ దలంచి సువృత్త మనుఁగాని తరుణికువృత్తంబుఁ దలఁపఁడయ్యె
నతివమోముఁ దలంచి యకళంక మనుఁగాని చెలువకళంకంబుఁ దెలియఁడయ్యె
సుదతివర్పుఁ దలంచి శుచి యనుఁగాని యువ్వెలఁదుకయశుచి భావింపఁడయ్యె
గురువువంటిమహాత్ముఁ డిక్కురంగిణిఁ దరుణి చిక్కఁదనమే గుణంబుగ సంస్తుతించుఁ
గానివ్యభిచారదోషంబుఁ గాంచఁడయ్యె నజ్ఞుఁడే బ్రాజ్ఞుఁడన నెవ్వఁడవనినింక?

ఈవిధముగా నబ్బయామాత్యుఁడు చెప్పినరీతి నీతిబోధకవాక్యములు గాని, తారాశశాంక
మునలేవు. కవియొక్కగచనను దెల్పుపద్యములు కొన్ని యుదాహరించుచున్నాను—

చ. హతబహుకిల్బిషం బగు ప్రయాగము యాగమువాపహంబు సాం
ద్రతరగుణం బనంతరకు బట్టనఁ బట్టణమున్ సృజింపుమా
యతులితశిల్పశక్తి గొని యంచని యంచ నివూథి నెక్కి యం
చితగతి ధాత యేగ నుపసిద్ధులు సిద్ధులు తత్స్రజింపఁగన్.—ఆ ౧.

చ. అలఘలినారి పొల్పెనిగ యూవ వేశస్వకీయడింబలీ
లలు తవనెమ్మొగంబునఁ గళంకరుచు ల్మనుమీసకట్టుగా
వలమదయానదస్యులు వాతెఱ వెన్నెలడాలు లేఁతన
వ్వుల నమృతంబు పల్కులను బూనెను నాఁగ మనోహరాంగుఁడై.—ఆ. ౨.

ఉ. చందురుఁడుం బురందరగురుప్రియరామలచిఁ గంది నివ్వెఱం
జెందఁగ నింద్రుఁ డిట్లు శశి వినుతా వినాగరిపాలికిం
బందినవాని కార్తి యగుదా గురుదార కృతాపరాధమే
ధం దిగఁద్రోచి చేసితి వృథా విబుధావళిలో విరోధముల్.—ఆ. ౫.

## కూచిమంచి-తిమ్మకవి.

ఈకవి యనర్గళ మయినకవితాధార గలవాఁడు; బహుగ్రంథములను రచియిం
చినవాఁడు; ఇన్నిగ్రంథములను సలక్షణ మయినమృదుమధురపాకమున రచియించిన
కవి యాధునికులలో మఱియెవ్వఁడును లేఁడు. ఈకవి యారువేలనియోగిబ్రాహ్మణుఁ

డు; కౌండిన్యగోత్రుఁడు; బయ్యనామాత్యుని ప్రపౌత్రుఁడు; తిమ్మయామాత్యుని పౌత్రుఁడు; గంగనామాత్యుని పుత్రుఁడు. ఇతనికి లచ్చమాంబ తల్లి; జగ్గన్న, సింగన్న, నరసన్న, పితృవ్యులు; వీరమ్మ, పాపమ్మ, మేనత్తలు; సింగన, జగ్గన, సూరన, తమ్ములు; గౌతమగోత్రుల రామయామాత్యుని కూఁతురైన బుచ్చమ్మ భార్య. ఈవిషయములను రుక్మిణీపరిణయములోని యీక్రిందిపద్యము తెలుపుడు చేయుచున్నది—

సీ. గురుతరకౌండిన్యగోత్రవిఖ్యాతుండు బయ్యనామాత్యుఁ డేభవ్యతాత
నిరతాన్నదానవర్ధితయశస్సాంద్రుండు తిమ్మనసచివుఁ డేధీరుతండ్రి
ఘనులుజగ్గనయు సింగనమంత్రియును నరసన్నయు నేమంత్రి యనుఁగుఁదమ్ము
లలరఁ దిమ్మకవి సింగన్న జగ్గనయును సూరన యేధన్యసుతవరేణ్యు
లానరవీరమ్మ పాప మేఘునసహజ। లతిపతివ్రతి లక్ష్మి యేచతురరాణి
యట్టి శ్రీకూచిమంచివంశాబ్ధిచంద్రు। మజ్జనకు నలగంగనామాత్యుఁ దలఁతు.

ఈమధ్యను ముద్రింపఁబడిన రుక్మిణీపరిణయములో నీపద్యములోని నాలవపాదమున సింగన్న యనుటకు మాఱుగా రాజన్న యని యున్నది కాని యది యచ్చుతప్పని తలఁచెదను. తిమ్మకవికి సింగన్నయు జగ్గనయు సూరనయు నే కాని రాజన్న యనుతమ్ముఁడు లేనట్టు తాను రచియించినపుస్తకము లన్నిటివలనను దెలియవచ్చుచున్నది. అందు సింహాచలమాహాత్మ్యములోఁ గవి తనవంశవర్ణనము చేయుచుఁ బెద్దతమ్ముఁడగు సింగన్నను గూర్చి చెప్పిన పద్యముల నిం దుదాహరించుచున్నాను—

క. నాతమ్ములు సింగనయును । ఖ్యాతయశుఁడు జగ్గనయును ఘనతరసుగుణ
వ్రాతాంకుఁడు సూరనయును । ధీశాలిసమూహము లగుచు వెలసిరి సిరులన్.

సీ. వక్రించు చందంబు వదలక మూర్ధత నలరెను సురమంత్రి నపహసించి
సాధులంగూడి యుత్త్రాని బుధేంద్రుని గన నోపు నచలప్రసంగవృత్తి మించి
శ్రుతిదూరుఁడై చరించుచు రెండునాలుకల్ గలిగియుండెడు భోగికులుఁ దెగడి
భంగంబు నొందిన రేపట్టున నడలెను రత్నాధివాసుఁ దిరస్కరించి
ప్రజ్ఞచే గౌరవమున వాక్పాటవమున । నూరుగాంభీర్యమున జనుల్ పొగడ నెగడెఁ
గూచిమంచ్యన్వయాంభోధికుముదహితుఁడు । శిష్టహితరతుండు గంగయసింగమంత్రి.

కవియొక్క జన్మసంవత్సర మేదో తెలియదు గాని యితఁడు రచియించినగ్రంథములలో నెల్లను మొదటి దగు రుక్మిణీపరిణయము

శా. ఆరయ శాలివాహనశకాబ్దము లద్రిగుణాంగచంద్రులై
తీరగు మన్మథాబ్దమునఁ బ్రేమఁ బ్రబంధ మొనర్చి మీకిటుల్

చేఁకతో సమర్పణము చేసితి మీకృతి యాతమిస్రసహ్య
త్రైకరవమిత్రతారకముగా భువిఁ జెల్వగుఁగాత శంకరా.

అను పద్యమునుబట్టి శాలివాహనశకము ౧౬౯౭వ సంవత్సరము మన్మథాబ్దమునకు సరియైన హూణశకము ౧౭౭౫వ సంవత్సరమునందుఁ జేయఁబడిన దగుట స్పష్టమయి నందున, కవి యప్పటి కిరువదియైదుసంవత్సరముల ప్రాయమువాఁ డయినపక్షమున ౧౬౭౦వ సంవత్సరప్రాంతమునఁ బుట్టినవాఁ డైయుండవచ్చును. అచ్చతెలుఁగు రామాయణములోని

గీ. మునుపు మాకీవె భల్లాణుఁ డనెడి శైవకతయు రుక్మిణి పెండిలికతయు బొల్పు
మెకపుఁబుచ్చులికతయు మేల్మినీల పెండ్లికతయును గబ్బముల్ పేర్మిఁ గూర్చి.

అను పద్యమునుబట్టి భల్లాణరాజచరిత్రము రుక్మిణీపరిణయమునకంటె ముందుగా రచియింపఁబడినట్లు భ్రమ కలుగును గాని నిజ మారయఁగా రుక్మిణీపరిణయమును రచించిన తరువాతనే కవి రాజశేఖరవిలాస మను నామాంతరము గలభల్లాణచరిత్రమును రచించినటు పెక్కునిదర్శనములవలన స్పష్టమగుచున్నది. రుక్మిణీపరిణయమునందుఁ గవి తానావఱకు గ్రంథము లేవియుఁ జేసియున్నట్టు చెప్పుకొనలేదు. కవిచేత రచియింపఁబడిన మూఁడవగ్రంథమగు సింహాచలమాహాత్మ్యమునందు

గీ. ప్రతిథ మీఱంగ రుక్మిణీపరిణయంబుఁ
గలుషహర మగు రాజశేఖరవిలాస
మును మఱియుఁ జాలదండకములు శతక
ములును రచియించి కృతులు శంభునకు నిడితి.

అని కవి రుక్మిణీపరిణయమునే మొదటఁ జెప్పియున్నాఁడు. లక్షణసారసంగ్రహము, రసికజనమనోభిరామము మొదలయినగ్రంథము లన్నిటిలోనుగూడ కవి మొట్టమొదట రుక్మిణీపరిణయమునే పేర్కొనియున్నాఁడు. కవి యేహేతువుచేతనో రుక్మిణీపరిణయము చేసినతరువాతఁ జేసిన యచ్చతెలుఁగు రామాయణము నీలాసుందరీపరిణయము లోనుగాఁ గలపుస్తకములలోఁ దా నాపుస్తకములను జేసి ముగించినకాలమును వేసికొనలేదు.

తిమ్మకవి గోదావరీమండలములోని పిఠాపురసంస్థానములోనిదైన కందరాడ గ్రామమున కరణము. ఇతఁడు కందరాడగ్రామవాసుఁ డయినట్లు లక్షణసారసంగ్రహములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుఁడఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకుఁ బరమపావని యగులచ్చమాంబకును సుతుఁడ

వెరవొప్ప రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీల పెండ్లి
కథయును రాజశేఖరవిలాసము నచ్చతెనుఁగురామాయణంబును మొదలగు
కృతులు రచియించి పార్వతీపతికి భక్తి । తోడ నర్పణ మొసఁగినవాఁడఁ గంద
రాడపురసంస్థితుఁడఁ గమ్ముఁబ్రోడ నేను । తిమ్మకవిచంద్రుఁడను జగద్విదితయశుఁడ.

ఈయన గ్రంథములు చేయ నారంభించినకాలమునందు పీఠికాపురసంస్థానమునకు రావు మాధవరాయనృపతి ప్రభువుగా నుండెను. ఈవిషయము రుక్మిణీపరిణయములోని యీ పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

సీ. చక్రవాళాహార్యజలధిశుభ్రోన్నతప్రాకారపరిఖావిరాజితంబు
సాంద్రముక్తాసౌధచంద్రశాలానేకధర్మనిర్మితహర్మ్యశర్మదంబు
కరిసైంధవాందోళికాధేనుధనధాన్యవనదేవగృహసరోవర్ణితంబు
విమలచాతుర్వర్ణ్యవిద్వత్కవిశ్రేష్ఠభటఘటామాత్యవిస్ఫారితంబు
రాజమహేంద్రవరదుర్గరాజ్యభూరిభారసంభరణాక్రాంతిభాసమాన
రావుమాధవనృపపరిరక్షితంబు । భోగనికరంబు పీఠికాపురవరంబు

ఈరావు మాధవనృపతియే కొన్ని గ్రంథములు రచించిన యనంతరముఁ గవికిఁ గవిసార్వభౌమబిరుదము నిచ్చినట్లు రసికజనమనోభిరామములోని యీక్రిందిపద్యము వలనఁ గనఁబడుచున్నది—

సీ. నిఖిలవిద్యాభ్యాసనిపుణుఁడు మత్సహోదరుఁ డగు గంగసత్కవితనయులు
ఘనులు తిమ్మనయు సింగనయును లేఖకపాఠకులై కృతుల్వ్రాయఁ జేయఁ
జేర్చఁగాంచినవాఁడఁ బీఠపురప్రాజ్యరాజ్యాధిపత్యవిరాజమాన
భూరివైభవుఁడు నద్భుతపరాక్రముఁడును దానకళాధురంధరుఁడు నైన
రావు నీలాద్రిమాధవరాయనృపతి । చేతఁ గవిసార్వభౌమ విఖ్యాతబిరుద
మందినఘనుండఁ దిమ్మనామాహ్వయుఁడ నేను । విమలగిరిభక్తి మదిలోన విస్తరిల్ల.

కవి పీఠికాపురసంస్థానములో నుండినవాఁ డయినను తనగ్రంథములు వేఱొ నరాంకితము చేయక యిష్టదేవతయైన కుక్కుటేశ్వరస్వామికే యంకితము చేసియున్నాఁడు. ఇతఁడు రుక్మిణీపరిణయమును రాజశేఖరవిలాసమును జేసినతరువాత రాజు తనకొక గ్రంథము నంకితముచేయు మడిగినట్లును కవి యట్లుచేయు నిష్టములేనివాఁ డయినట్లును సింహాచలమాహాత్మ్యములోని యీపద్యములవలన నూహింపఁదగియున్నది.—

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన । నపవర్గం బిడఁగఁగలరొ యటుగాకున్నన్
ద్విపతురగభూషణాంబర । తపనీయాదికము చేతఁ దనుపంగలరో.

సీ. ద్విజపుంగవులకుఁ బ్రవేశింపఁగారాని పృథుగృహాంతరములఁ జేరనుండి
కృతియుంతధర్మపద్ధతు లెవ్వి యెఱుంగక ధరణిపై నడవఁ బాదములు లేక
దుష్కృత్యముల్ చేయుమంత్రములు చెప్పినట్టులె విహరించకనటింపఁ జుద్విజిహ్వకలుగలిగి
వితతంబుగా వక్రగతులచేఁ బొదలుచుఁ బూని యేప్రొద్దును బుస్సురనుచు
గాఢరోషవిషాగ్నులొద్ద్యాఘోరవక్త్రములుగల్గి దర్పదవర్తులగుచుఁ
జెలఁగుచుండెడుభోగిరాజులభజింపఁ గుటిలతరబుద్ధి నెవ్వాఁడు కోరఁగలఁడు?

* * * *

క. పరిపూర్ణ తుచ్ఛభోగం బునకై కొఱగానిజనులఁ బొగడుటయెల్లన్
గనుఁగొన నిహపరదూరం బని తలఁచి విరక్తాంతరంగుఁడ నగుచున్.

ఈయన శివభక్తుఁడయి తాను జేసిన గ్రంథముల నన్నిటిని పిఠాపురమునందలి కుక్కుటేశ్వరస్వామికే యంకితము చేసినను, ఒక్క సర్పపురమాహాత్మ్యమును మాత్రము రాజానుగ్రహము నపేక్షించి కాఁబోలును కవిసార్వభౌమబిరుద మందినతరువాత సర్పవరమునందలి భావనారాయణస్వామి కంకితము చేసెను. ఈసర్పవరము పిఠాపురపు రాజుల గురువులగు వైష్ణవస్వాములకు నివాసస్థలమయి పీఠికాపురమునకు సమీపమున నున్నది. కవిమాత్రము సర్పపురమాహాత్మ్యములో భావనారాయణస్వామి తనకు స్వప్నమున సాక్షాత్కరించి యిట్లాజ్ఞాపించినట్టు చెప్పికొనియున్నాఁడు.—

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుఁగురామాయణంబు
సారంగధరనరేశ్వరచరితంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహము నింపారఁ గూర్చి
కృతులు శంభునికిడినసుకృతివి నీవు ప్రతిభ మెఱయంగ నొక్కసత్కృతియొనర్చి
మాకు నర్పణచేయు నెమ్మదిదలిర్పఁ గవికైరవచంద్ర ముచితసుధీకులేంద్ర.

తనకు మాహేశ్వరాచారవృత్తి నుపదేశించిన శైవుఁడగు దెందులూరిలింగనారాధ్యుని

క. చిరభక్తిం బొగడెద సద్గురునాథుం దెందలూరికులపావనునిన్
గరుణానిధి నపరాంతకు హరమూర్తిని ఘనుని లింగనారాధ్యమణిన్.

ఇత్యాది బహుపద్యములతో బహుగ్రంథములయందు స్తుతించి శివభక్తుఁ డయినను, కవి తాను కేవల శివమతస్థుఁడుగాక శివకేశవులకు భేదము లేదని భావించెడి యద్వైతమతస్థుఁడయియుండెను. కవి తాను కట్టకడపట రచియించిన శివలీలావిలాసములో నిందు క్రిందఁ బొందుపఱిచిన పద్యమునందుఁ దాను జేసినపుస్తకముల నన్నిటిని జేర్చికొనియున్నాఁడు—

సీ. ప్రతిభ మై రుక్మిణీపరిణయంబును సింహాశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కతయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు
సారంగధరనృపచరితంబు సాగరసంగమాహాత్మ్యంబు రంగుమీఱ
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్వపురస
మంచితక్షేత్రకథనంబు మఱియుఁ బెక్కు శతకదండకసత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు భక్తి నర్పణ చేసితిభవ్యమతిని.

ఈ గ్రంథములలో సారంగధరచరిత్రమును సాగరసంగమాహాత్మ్యమును నాకు లభింపలేదు. అవి చిన్నగ్రంథము లని కవివంశములోనివా రొకరు నాతోఁ జెప్పియున్నారు. ఈకవి కవిత్వములో నచ్చతెలుఁగుపదము లధికముగా నుండును. కవిపతి మొట్టమొదట యౌవనకాలమునందు శృంగారప్రధానముగా రచియించిన దగుటచే రుక్మిణీపరిణయమునందే కవి యొక్క వప్రౌఢిమను జూపియున్నాఁడు. కవికృతము లయినబహుగ్రంథములు పురాణపాకమున రచియింపఁబడినవి. శ్లేషయులును శబ్దాలంకారములును విశేషముగా నుండినను, కవిత్వమునం దద్భుతకల్పన లంతగాఁ గానఁబడవు. మొట్టమొదట రచియింపఁబడిన గ్రంథములలో నదంత స్త్రీవాచకపదసంధులు లోనుగాఁగల కొన్ని దోషములు కనఁబడుచున్నను, అటుపిమ్మటఁ జేసినగ్రంథములు నిర్దుష్టములుగా నున్నవి. కవి యితరగ్రంథములను రచియించిన కాలపరిమితిఁ బట్టి విచారింపఁగా, ౧౬౨౬ వ సంవత్సరమునందు ముగింపఁబడిన రుక్మిణీపరిణయము ౧౬౨౦ వ సంవత్సరమునం దారంభింపఁబడి సంవత్సరమున కొక్కొక్కయాశ్వాసము చొప్పున నయిదాశ్వాసములు నయిదుసంవత్సరములలో రచియింపఁబడె నని చెప్పుట సత్యమున కంత దూరముగా నుండదు. కవన మారంభించి యొకటిరెండు శతకములను జేసి ప్రబంధరచనకుఁ బూనినప్పటికిఁ గవి కిరువదిసంవత్సరముల ప్రాయ ముండునని యనుట యంతగా తప్పు కానేరదు. కవి తరువాత రచియించిన రెండవగ్రంథ మగురాజశేఖరవిలాసము మూఁడాశ్వాసములును మూఁడుసంవత్సరములలోఁ జేసినపక్షమున, అపుస్తకమును ౧౬౨౯ వ సంవత్సరమున ముగించియుండవచ్చును. మూఁడవగ్రంథ మగుసింహాచలమహాత్మ్య మయిదాశ్వాసములు నయిదుసంవత్సరములలోఁ జేసినయెడల, అస్థలపురాణము ౧౬౩౩ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. కవిచే రచియింపఁబడిన గ్రంథములలో నాలవదియు నచ్చతెలుఁగుకావ్యములలో మొదటిదియు నైననీలాసుందరీపరిణయము మూఁడాశ్వాసములును మూఁడుసంవత్సరములలో రచియింపఁబడినచో, అది ౧౬౩౬ వ సంవత్సరమునందు ముగింపఁబడియుండును. అయిదవగ్రంథ మగు నచ్చతెనుఁగురామాయణ మాఱుకాండములు నాఱుసంవత్సరములలోఁ గూర్పఁబడిన

పక్షమున, అది ౧౭౩౨ వ సంవత్సరమునందు సమాప్తి నొందియుండును. ఈయప్ప తెలుఁగుకావ్యముల రచనచేతఁ గవికి నభినవవాగనుశాసనబిరుదము వచ్చెనని చెప్పుదురు. ఆఱవగ్రంథము కువారంగధరచరిత్రము రెండుసంవత్సరములలోఁ జేసెనేని, అది ౧౭౩౪వ సంవత్సరములో పూర్తి యయియుండును. ఏడవది యగు సాగరసంగమమాహాత్మ్యము రెండుసంవత్సరములలోఁ జేయఁబడినయెడల, ౧౭౩౬వ సంవత్సరమున సంపూర్ణమై యుండును. ఎనిమిదవగ్రంథ మగు లక్షణసారసంగ్రహము

గీ. శాలివాహనశకవర్షసంఖ్యకరరసాంగశశిసంజ్ఞలను రౌద్ర్యబ్దమునను
భాద్రపదశుక్లపంచమిపట్లఁ బూర్ణమయ్యె నీకృతి నీపేర నగసుతేశ.

అని శాలివాహనశకము ౧౬౬౨ వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౭౪౦ వ సంవత్సరమునందు ముగింపఁబడినదని కవియే చెప్పియున్నాఁడు. మూఁడాశ్వాసములు గల యీలక్షణగ్రంథము రచియించుటకుఁ గాఁకి ౧౭౩౬ వ సంవత్సరము మొదలుకొని నాలుగుసంవత్సరములు పట్టియుండును. చంద్రమపాలెములో నున్న యీకవివంశమువారియొద్దఁ గల పుస్తకములను వెదకింపఁగా నందు భారతాదులును లక్షణవిషయకగ్రంథములును దక్క విశేషగ్రంథము లేవియుఁ గానఁబడనందునను, లక్షణసారసంగ్రహములో లక్ష్యములుగాఁ జూపఁబడిన ప్రబంధాదులలోని పద్యములు చాలవఱకితరపూర్వలక్షణగ్రంథములలో నున్నవే యగుటచేతను, కవి యీగ్రంథరచనమునందు భారతరామాయణములను నతి కొన్నిప్రబంధములను మాత్రమే శోధించినట్టు తోఁచుచున్నది. అందుచేత గ్రంథసమాప్తికి నాలుగుసంవత్సరములు చాలును.

గీ. తెలుఁగు కిమున్ను లక్షణంబులు మహాకవీశ్వరుల్ పెక్కు రచియించి యిడిరి కేల
కూర్చవలెనన్నఁ బ్రౌఢిమకొఱకు నాకుఁ దెలిసిన తెలుఁగుఁ దగఁ గొంత తెలియఁబలుకు.

అని కవి లక్షణసారసంగ్రహమునఁ బూర్వలక్షణగ్రంథములలో లేని నూతనవిషయములు కొన్నిటిఁ జేర్చినట్లు చెప్పియున్నాఁడు. కొన్నివిషయములను గవి క్రొత్తగా శోధించి చేర్చెననుటకు సందేహము లేదు. తొమ్మిదవగ్రంథ మగు రసికజనమనోభిరామ మనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించుటకు గాఁకి ౧౭౪౦ వ సంవత్సరము మొదలుకొని ౧౭౫౦ వ సంవత్సరమువఱకును పదిసంవత్సరములు పట్టినది.

సీ. * * రసికజనమనోభిరామం బనెడుపేరఁ దనరుగున శాలివాహనశకాబ్దములఁ గరగిరిరసభూసంఖ్యఁ దద్దయు వెలుఁ బ్రమోదూతవత్సరమున
నీప్రబంధంబు రచియించి నీకొసఁగితి.

అని కవి రసికజనమనోభిరామమును దాను శాలివాహనశకము ౧౬౭౨ వ సంవత్సరమునకు సరియైన ౧౭౫౦ వ సంవత్సరమున రచియించినట్లు చెప్పెను. ఈకవి యీ

గ్రంథమును బహుపుస్తకములు చదివి బహుసంవత్సరములు శ్రమచేసి తన ప్రౌఢిమ నంతయు జూపి వసుచరిత్రమువలె నుండవలెనని దాని ననుసరించి చేసెను. అందుచేతనే కవి యాగ్రంథాదియందు

సీ. బహుపురాణములు ప్రబంధములు లక్షణశాస్త్రములు ల్వివిధకోశములు నాట
కములు లలంకారశాస్త్రములును శోధించి ప్రౌఢిమై నేతత్ప్రబంధ మే నొ
నర్చెద * * * * *

అని వ్రాసికొనియున్నాఁడు. అయినను వసుచరిత్రమునం దుండెడు ప్రౌఢిమలోను సారస్యములోను శతాంశమైనను రసికజనమనోభిరామమునకు రాలేదు. అన్యోన్య తారతమ్యము తేటపడుటకయి యుభయగ్రంథములయందును సమానవిషయములను దెలుపు పద్యములను గొన్నిటి నిందుఁ జూపెదను. వసుచరిత్రములో గిరికాదేవిని గూర్చుటకయి రాజుచేతఁ బంపఁబడిన దూతపోయి సఖీజనమధ్యమున నున్న కన్నియను జూచి సమయోచితసరసాలాపములతో ముచ్చటించి యామె చెలికత్తెలచేతనే,

ఉ. ఇన్నగరాజుఁ జూచి వసుధేశ్వరుఁ డెన్నఁడు వచ్చు వచ్చి యీ
క్రొన్ననతీవజొంపములలోనకు నెన్నఁడు డిగ్గు డిగ్గి యీ
కన్నియఁ గన్నులారఁ గుతుకంబున నెన్నఁడు గాంచుఁ గాంచి తా
నెన్నఁడు గారవించుఁ జెలు లెన్నఁడు గాంతు రభీష్టసంపదల్

రాజునిమిత్తమయి ప్రార్థించునట్లుచేసి నేర్పుతో కార్యసంఘటనముచేయఁగా, రసికజనమనోభిరామములోఁ బ్రియురాలి నిమిత్తమయి రాజుచేఁ బంపఁబడినదూత యామెకడకుఁబోయి

చ పలుకులు కేయు నేటి కిఁక భావభవప్రతిమానుఁ డైనయా
చెలువునితోడుతం జెలిమి చేకుఱకున్న నయారె నీమెయిం
గల యెలజవ్వనం బడవిఁగాచినవెన్నెలసుమ్ము ముద్దులేఁ
జిలుకలకొల్కి నాపలుకు చిత్తమునం దలపోసిచూడుమా.

అని చెప్పి యామెచేత

చ అవునవు మంచిప్రోడవె బళా యెఱుకించుక లేక మానినీ
నివహసభాగ్రభాగమున నిల్చి వినం గనరానివాక్యముల్
తవిలి వచింపఁ జాగితివి తాళుము మే మతియొక్కఁడైన దూ
తవు నిను నేమియుం బలుక ధర్మము కాదని యంటి మిత్తఱిన్.

అని చీవాట్లుతిని తనప్రభువువద్దకు మరలివచ్చెను.

చ. కటకట మన్మథుఁ డొక్క త్రుటికాలముఁ బాయనిదాన నొంటిమై
నెటువలె వచ్చి తమ్మ చెలి యిప్పటి వేకువఁ దేనెవాక లీ
వెటువలె నీఁగి తమ్మ తెరు వెల్లను బుప్పొడి నీపదాంబుజం
బెటువలె నోర్చె నమ్మ తరుణీ తరుణమ్మ కడింది చైదముల్ — వసుచ.

ఉ. కొమ్మరొ మున్ను రంభ వెతఁ గుందుచు నిల్లెడఁ బాసి యిమ్మెయిన్
మమ్ముల చేసి యొంటిగ వనంబున కేటికి వచ్చితమ్మ నె
త్తమ్ముల గేరు నీమృదుపదంబులు కందెఁ గదమ్మ మేలు మే
లమ్మకచెల్ల నీబలుగయాళితనమ్ములు చెప్పఁ జిత్రముల్. — రసికజ.

ఈపుస్తకమునందు స్త్రీవర్ణనములు మొదలయినవి శెట్టిగాఁ జేయఁబడినవి. ఈశృంగార ప్రబంధమును రచియించిన కొంతకాలమునకుఁ గవి వీధినిబడి పోవుచుండఁగా నొక వేశ్య చూచి రసికజనమనోభిరామమును జదివియున్న దగుటచే నందలి రసికత్వమునకు దానందించి వలచి వచ్చి పైఁబడి కవిని కౌఁగిలించుకొనఁగా నతఁడు పెదతెలుగము పడ్డె ననియు, అంతట నాసరసురాలు

చ. చతురులలోన నెంతయును జాణ వటంచును నేను గౌఁగిలిం
చితి నిటు మాఱుమో మిడఁగఁ జెల్లునె యో రసికాగ్రగణ్య

అని మాఱుకవిత్వము చేసి యడుగఁగా,

ఆ॥ ద్భుతమగునట్టి బంగరపుఁ గొంగరపుంగవఁ బోలుఁ జీకుచ
స్వైరుల నొమ్ము నాటి యులికీఁపున దూసె నటంచుఁ జూచితిన్.

అని కవి పద్యముఁ బొందియుత్తర మిచ్చెననియు, చెప్పవాడుక యొకటి కొంతకాలము నుండి కలదుగాని యీగాథ రసికత్వమునకు కల్పనమాత్రమే యని ముఖ్యముగ భావించెద మిపూర్వ పండితుల చేతను కవుల యందారోపింపఁబడినరీతి యసత్యకల్పనమే యనుటకు సందేహము లేదు. రుక్మిణీపరిణయము రచించునాటికిఁ గవి కిరువదియైదు సంవత్సరములున్నచో నిప్పటి కాతని కెనుబదిసంవత్సరములు దాటియుండవలెను. కులవృత్తిని మానుచే నెంత సిగ్గువిడిచినదయినను పట్టపగలు నట్టనడివీధిలో నడుచుచున్న ముసలి గనినపయిఁబడి కడుచపలపడఁతి యెల్లరుఁ జూచుచుండఁ గౌఁగిలించుకొన్న దనుటకంటెఁ బరిహాసాస్పదమయిన విరుద్ధపుమాట మఱియొకటి యుండదు. పదవదియగు మూఁడాశ్వాసములుగల సర్పపురమాహాత్మ్యము తరువాత నాలుగుసంవత్సరములలో ౧౭౫౪ వ సంవత్సరమునందు ముగింపబడినది.

పదునొకండవదియు కట్టకడపటిదియు నగు శివలీలావిలాస మను నాలుగాశ్వాసముల గ్రంథము మఱి కొంతేండ్లకు

గీ. శాలివాహనశ వర్ష సంఖ్య వసుర। సాంగశశిసంజ్ఞ నలరు ధాతాబ్దమునను
దగ రచించినయీకృతి ధరణియందు। నాసుధాకరతారార్కమగుచునుండు.

శాలివాహనశకము ౧౬౬౮ వ సంవత్సరమునకు సరియైన ౧౭౪౬ వ సంవత్సరమున రచియింపఁబడినది. అటుతరువాతఁ గవిచే రచియింపఁబడినగ్రంథము లేవియుఁ గానరావు. ఆరంభదశలో రచియింపఁబడిన కుక్కుటేశ్వరశతకము మొదలయిన కొన్నిశతకములును దండకములును గలవు. శివలీలావిలాసము ముగిసిన యల్పకాలములోనే కవి పరలోకగతుఁడయ్యెను. కాఁబట్టి యితఁడు ౧౭౪౭ వ సంవత్సరమునందు మృతినొందెనని యించుమించుగా నిశ్చయముగానే చెప్పవచ్చును. అందుచేతఁ గవి దాదాపుగా డెబ్బదిసంవత్సరములు జీవించి సుమారు నలువదియైదు సంవత్సరములు గ్రంథరచనయందుఁ గడపినట్టు స్పష్టమగుచున్నది. ఈకవికి సంతతి లేదఁట. ఈకవి యొక్క కడపటికాలములో నింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని యుద్ధములు జరగినందున కందరాడమీఁదుగా రాకపోకలు చేయుచువచ్చిన సేనలదాడికి వెఱచి యాగ్రామము విడిచి చంద్రమపాలెము నివాసముగా నేర్పఱచుకొనెను. ఈకవివంశమువా రిప్పటికిని చంద్రమపాలెములోనే యున్నారు. ఆంధ్రనామసంగ్రహము చేసిన పైడిపాటిలక్ష్మణకవి, కన్నప్పచరిత్రము చేసిన కంచిరాజు సూరయ్య, శివజ్ఞానదీపికను జేసినకవి లోకబ్రహ్మ, ఇందుమతీకళ్యాణము చేసిన యింగర బసవయ్య, ద్వాదశరాజచరిత్ర చేసిన కట్టవరపు చిట్టమరాజు, ద్విపద రుక్మాంగదచరిత్రము చేసిన రామయ భాస్కరుఁడు, మొదలగు కవులీకవికిఁ బూర్వులనుండినట్లు లక్షణసారసంగ్రహములో నియ్యఁబడిన లక్ష్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కవియొక్క శైలిని జూపుటకు పద్యములఁ గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

రుక్మిణీపరిణయము.

ఉ. సారము ముద్దుఁబలుక్కు ఘనసారము దర్పమే తావి కా
సారము నాభిరంధ్రము విసారము లేటమిటారిమూపు శ్రీ
కారము కర్ణయుగ్మము చొకారము నవ్వు మొగంబు షట్పదా
కారము కొప్పు సన్మథువికారము మోవి వధూలలామకున్.—అ. ౨.

ఉ. కౌను చలింప నిద్దపు మొగంబునఁ జెమ్మటముంపఁ గంకణ
ధ్వానము లింపులింపఁ గరతాళగతుల్ వనరింప హారముల్
పూనినటింప నూర్పుసోలపు న్వలితెమ్మర లంకురింపఁగాఁ
జానయొకర్తు రుక్మిణికి సంపఁగినూనెఁ దలంటె నేర్పునన్.—అ. ౪

రాజశేఖరవిలాసము.

శా. ఏరాభూవర మాకుఁ గాంచనతురంగేభాంబరాందోళికా
భూరిస్యందనమందిరోపవనసమ్యగ్భూషామణిశ్రేణులన్
చేరన్ జెందగుపల్లెలుం బసుపులన్ లెక్కింప కర్థంబులన్
ఈరా కోరిక తీఱ మీకిఁక నివెంతేనియున్ ధీరతన్.—ఆ. ౧

ఉ. అయ్యెడఁ జెల్లఁబొంచ విభువానతి గైకొని వాఁడిచూపులో
య్యొయ్యనమీఱ లేనగవు లొప్పఁగఁ జెక్కులఁ బాఱఁ దీపమై
బయ్యెదజాఱ ముద్దుమొగబల్కులు చెల్వలరార నవ్వటుం
జయ్యనఁ జేరి మ్రొక్కె నెఱజాణను జెల్ల నెలంగి రంగుగన్.—ఆ. ౩.

సింహశైల మాహాత్మ్యము.

మ. వలపుంగొజ్జఁగినీటిశీతలహరీవార్బిందువుల్ చిమ్ముచున్
గలయం గప్పురపుందుమారము మెయిన్ గాటంబుగాఁ గప్పుచున్
బలవద్దర్పకబాణపంక్తులక్రియన్ బైపై విరుల్ గుప్పుచున్
జెలఁగెన్ స్యందనసమీరణము దిగ్జశ్రేష్ఠాగ్రభాగంబునన్.—ఆ. ౨.

ఉ. అక్కట! దైత్యనాయక యహీంద్రశయుండు దయాత్మ నెంతయున్
మక్కువమీఱ నిన్ను నను మాపు వలపక తత్త్వపద్ధతిన్
జెక్కుఁ దెఱంగులం గడఁగి చేరొక్కనిఁ జూచెదు చిన్నవాఁడ వీ
వెక్కడ? తత్త్వ మెక్కడ? సహింపఁడు సుమ్ము నిశాచరార్భకా.—ఆ. ౩.

నీలాసుందరీ పరిణయము.

చ. మిసిమిఁ గడాని బంగరుపుమేడల సోరణగండ్లవెంట రే
ల్పరియెడిచిక్కమొత్తిలను నిక్కఁగఁ జూచి మెఱుంగుబోండ్లు ని
చ్చలు పిక్కిళ్లఁబెట్టియవి జాతివిడెంపుఁ దమ్మగోళ్లు చుక్కలం
చును నెఱనిల్చి చేవదగిఁ దూముచు నబ్బురపోదు రందులన్.—ఆ. ౧.

ఉ. కన్నులవింటివాఁడ తగకన్నులదేవరతోడఁ బోరి మున్
బన్నము నొంది మేనొకఁగుపట్టున నెక్కడ డాఁగిపోయె నీ
వన్నెతికంబు నీ నేఁడు కోమలినన్నోయిలవిల్కు మూఁకలన్
బన్నగఁ గూర్చి చేతియుల బాములఁ బెట్టెదు పోటుబంటవై.—ఆ. ౩.

అచ్చతెలుఁగు రామాయణము.

ఉ. కాయము మేటి తెప్ప కొను కాయము నిద్దపుఁబూఁతమాఁపు మో
కాయముఁ బంజరంపుఁజిలుకాయము నబ్బపుసోయగంపుఁబ్రో

కాయఁగఁ బల్కవేమి యొఱుకాయఁగఁ బంతము తీఱెనోటు కై
కాయము నేర నిట్లు దుసుకాయముఁ మాయఁగఁ గోరకాయుమున్.—అయోధ్యా.

చ. జగములఁ గిల్లిరా పుడమిజవ్వని గాదిలిశిట్టి డాయఁగ
ముగుదల మిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకు నెవ్వరుం
దగ దిదె తొందు దెల్పఁ గలవంటలు గల్గినఁ జేసి యిట్టిక
దగపడె నింకనైన విడనాడక కామునిఁ బ్రాపుఁ జేసుమా—సుందర.

లక్షణసారసంగ్రహము.

చ. కరములు దోయిలించి కుతుకంబున నిచ్చలుఁ బ్రస్తుతింతు భా
స్వరగుణవంతునిన్ సకలసత్కవిజాలవశీవసంతునిన్
జిరకరుణాంశాంతుని విశిష్టజనావనతాపశాంతునిన్
సురతరుమంజరీవిభయశోహరిదంతుని నేకదంతునిన్ —ఆ. ౧.

మ. ఘనకారుణ్యకటాక్షు రాక్షసచమూగంధేభహర్యక్షు స
జ్జనసంరక్షణదీక్షు పాలితసరోజాతాక్షు శక్రాంబుజా
సనముఖ్యామరపక్షు దక్షసవనాంచత్క్రౌర్యధత్రామాక్షు యా
చనకప్రాంగణకల్పవృక్షు రిపుశిక్షాదక్షు మోక్షప్రదా.—ఆ. ౨.

రసికజనమనోభిరామము.

మ. తనుమూలంబులపొంతఁ బొంచి సచివోత్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వరవిగ్రహన్ సముదంచచ్చంచరీకాలకన్
శరదిందుప్రతిమాస్యచారువదనన్ జక్రస్తని న్విస్ఫుర
త్సరసీజాతదళాయతాక్షి నొకకాంతాలోకచూడామణిన్.—ఆ. ౨.

మ: సవనాదిక్రియల న్సుధాంధులను మెచ్చం జేసి ధన్యాత్ములై
నవిశేషజ్ఞుల కబ్బఁగాక యొకటా నాకేటికిం గల్గు ని
ర్భువనాతీతవిలాసవిభ్రమరమాభూమిప్రభాంచన్మరు
ద్ధవళాక్షీమధురాధరాధరసుధాధారాసమిద్ధోరణుల్.—ఆ ౫.

సర్వేశ్వర మాహాత్మ్యము.

మ. సరసీరుహలోకిరబిందుకణముల్ సమ్యగ్గతింబూని వి
స్ఫురదారామలతాంతసౌరభరజఃపుంజంబుఁ గైకొంచు ని
ర్భరమందానిలశాబకప్రకరముల్ పల్మాఱు నల్కొనలోఁ
దిరుగుం బాంథజనప్రతాపహరణోద్వృత్తిం బ్రకాశించుచున్.—ఆ. ౨.

ఉ. నీరరుహాక్షి లోకనము నిల్పఁగఁ జోఁ గులహీనుఁడౌ హయా
శ్రీకపహేమవామరమశేఖరమౌళి సువిభూషణాలికా
స్తోకవిభూతి చెంది పరిశుద్ధకులుం డన మించు లేఁచో
నాకనివాసులున్ వెతల నందఁగఁ దమ్మ ఒగక్కుటుంబినీ.—ఆ. ౩.

శివలీలావిలాసము.

ఉ. అంగదముద్రికావలయహారలలాటికలెమ్మె నెమ్మెనౌఁ
రంగులు గుల్కఁ గ్రొందగటువాడెపుఁబావడ సొంపుమించ మే
ల్బంగరుగిల్కుటందియలు బాలిక నంఘ్రులఘుల్లుఘుల్లనన్
గంగ యమునాంగులం గలసి కౌతుకలీలలఁ గ్రీడ సేయుచున్.—ఆ. ౧.

ఉ. కన్నులు మూయుఁ దల్లిపడి గ్రక్కునదిక్కులు చూచు నూరకే
సన్నలు చేయుఁ బైవలువ చయ్యన నవ్వలఁ ద్రోయు మింటిపై
వెన్నెలగాయు చందురుని వేఁడికిఁ దాఁ బెడఁబాయు నద్దిరా
చిన్నెలజంగమప్రభుని చిత్తవికారము లెన్నఁ జిత్రముల్.—ఆ. ౨.



## పక్కిలంక వీరభద్రకవి.

ఈకవి కూచిమంచి తిమ్మకవి జగ్గకవుల కాలములోనే పీఠాపురమునందుండి మిక్కిలి ప్రసిద్ధిగన్నవాఁడు. కూచిమంచి తిమ్మకవివలెనే యితఁడును దెందులూరి లింగనారాధ్యుని శిష్యుఁడయి తన వాసవదత్తాపరిణయమునం దాతని నిట్లు స్తుతించి యున్నాఁడు—

సీ. అంభోధివలయితకుంభినీజనతతిదంభశాంభవకళావిజృంభితములు
నందివాహపదారవిందవిశ్వాసమరందసంపాదనేందిందిరములు
స్వైతుణాదగనరాధ్యత్వలక్ష్మీప్రదానత్వసామ్రాజ్యదక్షిణములు
ఊహాపదాత్మబోధామృతస్వాంతసాదేహళీలాపశ్యతోషకములు
ధీరతాగుణమణిహారి దెందులూరి । లింగగురువరసత్కృపాపాంగవీక్ష
ణములు సతతంబు శుభవిధానంబుఁ జేసి । శిష్టజనుల దయను రక్షించుఁ గాత!

ఈకవి గౌరీకళ్యాణ మను నామముతోఁ గాళిదాసకృతమయిన కుమారసంభవమును దెలిఁగించుటయేకాక సుబంధుకవి విరచితమయిన వాసవదత్తను వాసవదత్తాపరిణయ మను పేరితో నాంధ్రీకరించి దానిని పీఠికాపురాధీశ్వరుఁడయిన రావు మాధవరాయని

గారి కంకితము చేసెను. పద్మనాయకకులసంభవుఁడైన శ్రీ రామచంద్ర మాధవరాయ నృపాలుఁడు తన్ను బిలిపించి వాసవదత్తను దెనిఁగింప నడిగినకథను కవి వాసవదత్తా పరిణయమునం దిట్లు చెప్పికొనియున్నాఁడు—

శా. శ్రీమచ్చంద్రకళాకిరీటపదరాజీవద్వయీభావనా
సామర్థ్యోదితవాక్ప్రపంచఘటనాచాతుర్యవిద్వజ్జన
స్తోమానందదశేముషీనిజవిలాసు న్వాత్కలంకాన్వయున్
ప్రేమాధ్యాస్పదు వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్.

క. తాతలతరమునసుండియు । నీతనిజనకుండు మఱియు హితుఁడు కవీంద్రుం
డీతని చేతం గృతి వి । ఖ్యాతిగఁ గైకొందు ననుచు హర్షం బొదవన్.

గీ. సదనయుగ్మమున సముచితాసనమునందు । నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞ యొసఁగి
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు । సదయానుస్ఫూర్తి నిట్లని యానతిచ్చె.

క. శ్రీవెలయ నుభయభాషల । నీవలెఁ గృతిఁ జేయఁగలరె నేఁటి వింద్రల్
భూవిశ్రుతకవితావి । ర్భావయశస్సాంద్ర వీరభద్రకవీంద్రా.

సీ. మీతాత లోకవిఖ్యాతభాషాఖిలశేషాహి యాచంద్రశేఖరుండు
మీతండ్రి చాటువాగాతతచిత్రప్రబంధకల్పనశాలి భాస్కరుండు
మీతల్లితండ్రి పురాతనసత్కవినాథుల కెనవిశ్వనాథసుకవి
మీమేనమామ సుత్రామవైభవుఁడు సద్యఃకృతిమతి వేంకటాద్రిసుకవి
చదువకరయె శ్రీసతీశప్రసాదగరిమ । బాల్యమునను గుమారసంభవము తెనుఁగు
చేసి కవు లెంచఁ బ్రఖ్యాతిఁ జెంది తీవు । కలరె నీసము లాధునికులు కవీంద్ర.

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
దిత్యసభాంతరంబునఁ బ్రశస్తుఁడై ఘనధీసమగ్రతన్
సత్యవతీతనూభవునిజాడఁ బ్రసిద్ధికి నెక్కె నవ్యసా
హిత్యమునన్ సుబంధుసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁ గన్నవాఁ డిలన్.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు । ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
దారతను జెప్పె వాసవదత్త యనఁగ । నార్యులా కథ కడుచోద్య మనిరి సభను.

మ. స్తవనీయం బగుతత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర
న్నవమంజీరరవనాదమేదురనితాంత ప్రౌఢవాగ్గుంభనన్
భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ వైదర్భిగతిం గూర్పు త
త్కవివాక్యోక్తులు కొన్ని నీకవితకుం గైదండగా వింపఁగన్.

క. వరమతి వాసవదత్తా । పరిణయముఁ జెప్పె యీప్రబంధము విద్వ
త్పరిగణ్యంబుగ మాకుం । జిరముగ నంకితము చేయ ధీరవిచారా.

భర్తృహరియొక్క సుభాషితరత్నావళిని తెనిగించిన యేనుఁగు లక్ష్మణకవి మొదలైన వారికవితో సమకాలికులు. సమకాలమునందున్న కవులు కూచిమంచి తిమ్మకవిని బొగడక యీతనిని బొగడుటచేఁ దిమ్మకవికవిత్వముకంటె నీతనికవిత్వమునం దప్పటివారి కధికాదర మున్నట్లు స్పష్టమగుచున్నది. ఏనుఁగు లక్ష్మణకవి తన రామవిలాసమునందుఁ బూర్వకవులను స్తుతి చేసినపిమ్మట

గీ. భట్టుకవి విశ్వనాథుఁ బ్రార్థించికొలుతు । నతనినందనుఁ డగువేంకటాద్రికవికి
వాక్యప్రౌఢులు గానిచ్చు వక్కలంక । వీరభద్రుని భావింతు గౌరవమున.

అని యీవీరభద్రకవిని జేర్కొనియున్నాఁడు. ఆకాలమునం దుండిన యాదవల్లి భవానిశంకరకవియుఁ దాను తెనిగించిన ధర్మఖండములో

మ. హరిగుర్వం డగురావుమాధవనృపాలాగ్రేసరుం గావ్యచా
తురి మెప్పించి ధరిత్రీసత్కృపసిరుల్ తోరంబుగాఁ బొంది బం
ధురతేజుం డగువక్కలంకకులపాథోరాశిరాకాసుధా
కిరణుండై తగు వీరభద్రసుకవిం గీర్తింతు నానేర్పులన్.

అని వీరభద్రకవిని ప్రశంసించియున్నాఁడు. సమకాలికులు వారిట్లు మెచ్చుటచేత నీ యీకవి యసమానకవిత్వప్రౌఢిమ గలవాఁడని తేటపడుచున్నది. ఈవీరభద్రకవి యారువేల నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; భాస్కరకవిపుత్రుఁడు; చంద్రశేఖరకవిపౌత్రుఁడు; భట్టుకవి విశ్వనాథకవి దౌహిత్రుఁడు. ఈతని తల్లి జగ్గాంబ; మేనమామ భట్టుకవి వేంకటాద్రికవి. ఈకవి చెంద్రితాలెమునందియుఁ బిఠాపురసంస్థానమునం దుండినవాఁడు తండ్రితాతమువారును తల్లితాతమువారునుగూడ సత్కవీశ్వరులు. ఈకవి మాతామహుఁడైన విశ్వనాథకవి సిద్ధాపురసంస్థాపకుఁడయిన శ్రీవత్సవాయ ముసలి తిమ్మరాజుగారికిఁ దాను రచించిన శేషధర్మప్రబంధము నంకితము చేసెను. శేషధర్మరత్నాకర మనుపేరితో నీగ్రంథమునే రామమహేంద్రనివాసుఁడగు కొండయకొడుకగు శ్రీనివాసకవియు రచియించెను. వీరభద్రకవి ౧౭౫౦ వ సంవత్సరప్రాంతము వఱకు జీవించియుండవచ్చును. ఇతఁడు తన వార్ధకదశలో పిఠాపురమును విడిచి వృద్ధగౌతమీతీరమునందున్న ముమ్మిడివరము ప్రవేశించి సన్యాసాశ్రమమును స్వీకరించి యక్కడనే సిద్ధిఁబొందెనఁట. ఈకవి విరచితగ్రంథములనుండి కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను—

### వాసవదత్తా పరిణయము.

శా. ఝల్లీకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగప్రభో
ద్యల్లీలన్ ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీవేల్లితవాసులూనపుల్లకేవం గొంటుజుంటీఁగలం
దెల్లం గుయ్యిడఁ దేనియల్ గొనెడు భూమిన్ విచిత్రంబుగన్.— ఆ. ౬

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమనస్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభఃపరిషేచనార్ద్రములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం జాల మించెం ధరన్.— ఆ. 3.

### కుమారసంభవము.

చ. వారుఁ డఖిలేశుఁ డవ్వనరుహాక్షిశపక్రపతిఘాతహేతువై
పరఁగినతత్స్వపర్యలకు భావమునం గడుమెచ్చి యొప్పెఁ దా
నరయ వికారకారణము లంటిన నిశ్చలతం దనర్చునె
వ్వరిహృదయారవిందములు వారలె ధీవరు లెంచిచూడఁగన్.— ఆ ౧.

చ. మలయవసుంధరాధరసమాగతబంధురగంధవాహనా
కుల నెరిరించుచున్ వివిధసూనగుళుచ్ఛగజాఃపరంపరల్
కలయఁగఁ జూపు లడ్డుకొనఁగాఁ గను గానక దగ్గ మేర్పడన్
జెలఁగి మృగంబు లప్పిపినసీమ నటించె మధూదయోన్నతిన్.— ఆ. ౨.

ఉ. అన్న తలంచు రూపను హితాళి తలంచుఁ గులంబు తల్లి దా
నెన్న సువస్తువుల్ వరుల నేర్చుతఱిన్ బురవైరి నెంచినన్
గన్నులు మూడు పుట్టుటయు గాఁగరాదు దిగంబరుండునాం
జిన్నముసొమ్ము లేమ తెలిసెం దగఁ డాతఁడు నీకు మానినీ.— ఆ. 3.

ఉ. క్రొత్తలు చేసి గేహములు గోవజవాజిని బచ్చికస్తురిన్
మెత్తిరి గోడ లందుపయి నిద్దపుఁజాయలపాలుకున్నముల్
చిత్తరువుల్ లిఖించిరి విచిత్రగతి న్నయనోత్సవంబుగా
నత్తతి నుత్తముల్ ప్రతిగృహంబున శోభనశోభ సంధిలన్.— ఆ. ౪.



## కూచిమంచి-జగ్గకవి.

ఇతఁడు సుప్రసిద్ధుఁ డయిన తిమ్మకవి సార్వభౌముని రెండవతమ్ముఁడు. ఇతని జన్మసంవత్సర మేదో తెలియదుగాని తిమ్మకవికంటె నాలుగయిదుసంవత్సరములు చిన్నవాఁడయి యుండవలసినందున, ఇతఁడు 1700 వ సంవత్సర ప్రాంతమునందు పుట్టెనని యూహింపఁదగియున్నది. ఈజగ్గకవి యిరువదిసంవత్సరముల ప్రాయము వచ్చువఱకును చదువుసంధ్యలు లేక యల్లరిమూఁకతోఁ దిరుగుచు కాలము గడపెననియు, అప్పుడు వివాహితుఁడయి యత్తవారియింటికి మనుగుడుపునకుఁ బోయి మామగారు తనకుఁ బరమశుంఠ యైనయల్లుఁడు దొరకినందుకు కనుతాపపడఁగా రోషముచేత దేశాంతరమునకు లేచిపోయి పండ్రెండు సంవత్సరములు విద్యాభ్యాసము చేసి పండితుఁడయి కవిత్వము చెప్ప నారంభించెననియు, పుక్కిటిపురాణ మొకటి కలదుగాని యిది కేవల కల్పితకథ యని తోఁచుచున్నది. ఈకథనుబట్టి యీకవికి కవిత్వము చెప్ప నారంభించు కాలమునాఁటికి ముప్పదిమూఁడు సంవత్సరముల ప్రాయ మయి యుండవలెను. కూచిమంచి తిమ్మకవి తాను ముప్పదిసంవత్సరముల ప్రాయమునఁ జేయ నారంభించిన సింహశైలమాహాత్మ్యమునందుఁ దన పెద్దతమ్ముఁడైన సింగన్నను వర్ణించినతరువాత రెండవతమ్ముఁడైన యీజగ్గకవిఁ గూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు—

క. అతనియనుజన్ముఁ డతులిత । మతియుతుఁడు సమస్తరాజమాన్యుఁడు సుగుణా
న్వితుఁడు సమంచితకవితా । చతురుఁడు జగ్గప్రభాచంద్రుఁడు తనరున్.

క. ఘోటకలాటకిరాటవ । రాటమరాటాంగవంగరాజన్యసభా
ఝూటనిరాఘాటనట । చ్చాటుకవిత్వాంకుఁ డరయ జగ్గన ధరణిన్.

సీ. నిరతంబు నుడివోనిసిరిఁ గఱవొందియుఁ దవుటినిప్పటి మెక్కఁ దలఁపఁ డేని
షడమలాచార్యప్రశస్తిఁ గాంచియు వర్ణములు సంకరంబుగాఁ గలుపఁ డేని
ఖలజనసంశిక్ష గావింపుచుండియుఁ బతితుల నెపుడుఁ జేపట్టఁ డేని
యురుపుణ్యవర్తియయ్యును బాడబాశ్రయసీమ నిల్లుగను వసింపఁ డేని
యలజగన్నాయకుఁడు సాటియనఁగ భోగి । భోగమున నిర్మలాచారమున విశిష్ట
రత్నగణంబునఁ బుణ్యమార్గమున నరయ । సంగనామాత్య జగ్గయఘనునితోడ.

ఈపద్యములు రచియింపఁబడినకాలమునకు జగ్గకవి యించుమించుగా నిరువదియైదు సంవత్సరముల యీడుగలవాఁ డయి యుండును. ఇరువదియైదేండ్లప్రాయమునాఁటికే కొన్నిదేశములు తిరిగి రాజసభలలోఁ బ్రసిద్ధి గాంచఁ గలుగుటకు కవి యిరువదియేండ్ల

వయస్సునకు లోపలనే పండితుఁ డయి కవనచాతుర్యము గలవాఁ డయియుండవలెను. అందుచేత జగ్గకవి యిరువదిసంవత్సరములప్రాయము వచ్చువఱకును నక్షరజ్ఞానము లేనివాఁడని చెప్పెడికథ నమ్మఁదగినది కాదు. ఈకవి తనవివాహానంతరమున ధనార్జనము నిమిత్తమును పాండిత్యప్రకాశనమునిమిత్తమును బహుదేశాటనముచేసి రాజాస్థానములలో మెప్పొంది సత్కారము నొందుట వాస్తవమే యైనను, "భోటకలాటకిరాటవరాట మగాటాంగవంగ" యని ప్రాసనిమిత్తము వేయఁబడిన దేశసంచారము కొంత యతిశయోక్తి యై యుండవచ్చును. ఇతఁడు దేశాటనము చేసి వచ్చినతరువాతను దత్పూర్వమునను, జానకీపరిణయమును, ద్విపదరాధాకృష్ణచరిత్రమును, చాటుప్రబంధములును, సుభద్రాపరిణయమును, చంద్రరేఖావిలాపమును, సోమదేవరాజీయమును, రచియించెను. చంద్రరేఖావిలాపములోని యీక్రిందిపద్యమున వర్ణింపఁబడిన వరుసనుబట్టి విచారింపఁగా నితఁడు దేశసంచారము చేసి రాజస్థానములయందు రాజులమీఁద చాటుప్రబంధములు చేయుటకు ముందే జానకీపరిణయమును రాధాకృష్ణచరిత్రమును రచించినట్లు తోఁచుచున్నది—

సీ. రచియించితివి మున్ను రసికు లౌదలమెచ్చ సురుచిరజానకీపరిణయంబు
వరియించితివి కవివ్రాతము ల్పొగడంగ ద్విపదరాధాకృష్ణ దివ్యచరిత
ముచ్చరించితివి విద్వద్భూములు నుతింపఁ జాటుప్రబంధముల్ శతకములును
వర్ణించితివి యిరువదిరెండువర్ణనల్ రాణింపఁగా సుభద్రావివాహ
మాంధ్రలక్షలక్ష్యంబు లరసినావు! భూరిరాజస్థానసభల బూజితుఁడవు
బళిర నీభాగ్యమహిమ చెప్పంగఁదరమె! జగ్గకవిరాజచంద్ర వాచాసురేంద్ర.

ఇతఁడీ చంద్రరేఖావిలాపమును విజయనగర స్థానపతులలో శ్రీపూసపాటి విజయరామరాజుగారి చెల్లెలిపెనిమిటి యగు చింతలపాటి నీలాద్రిరాజుమీఁది కోపముచేతఁ జేసెను. ఇది బూతుపుస్తక మగుటచే నిందలిపద్యము లుదాహరింపఁ దగియుండలేదు. "అర్ణవవేష్టితాఖిల మహామహిమండలిలోన బూతులన్ బూర్ణుఁడ" నని కవియే చెప్పుకొనుటచే నితఁడు బూతుకవిత్వమునం దసమానపాండిత్యముకలవాఁ డయినట్లు స్పష్టమగుచున్నది. జగ్గకవి ధనసంపాదనము నిమిత్తము విజయనగరమునకుఁబోయి రాజుబావయైన నీలాద్రిరాజు నాశ్రయింపఁగా నతఁడు తా నుంచుకొన్న వేశ్యను నాయికఁగాఁ జేసి తనమీఁద ప్రబంధము చేయుమని కోరెనఁట! ధనాశచేత నట్టిప్రబంధరచన కొప్పుకొని కవి చంద్రరేఖావిలాస మనుశృంగారకావ్యమును జేసెనఁట! అటుతరువాతఁ దాను సంస్కృతకావ్యమును రచించి యిచ్చెదనని చెప్పి రాజుమతి మరలించిన యాఁడిమళ్ళ వేంకటశాస్త్రిప్రోత్సాహముచేత నీలాద్రిరాజు జగ్గకవికి నీయఁదగినబహు

మానముచేసి సత్కరింపక తిరస్కారమును జూపెనఁట! అందుపైని ముంగోపియైన యీసూర్యకవి తాను రచియించిన చంద్రరేఖావిలాసమును చింపివేసి చంద్రరేఖావిలాపమను పేరిట నిప్పటి బూతుగ్రంథమును జేసెనఁట! ఇందలి కవివర్ణనలోసహితము సాధుకవులను విడిచి కవి యిట్లు తిట్టుకవిత్వము చెప్పినకవులనే పేర్కొనియున్నాఁడు —

క. భీమకవి రామలింగని । శ్రీకంఠుండై వెలుంగు శ్రీనాథకవిన్
రామకవిముఖ్యులను బ్రో । ద్దామగతిం జిత్తవీధిఁ దలఁచి కడంకన్.

ఈపుస్తకములోని మొదటిపద్య మిట్లున్నది—

శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁ డ
స్తోకాటోపబల ప్రతాపపరరక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్జ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండు దా
వీఁకం జింతలపాటినీలనృపతి న్వీక్షించు నేత్రత్రయిన్.

ఈపుస్తకమును జేసి నగ్గకవి నిజామురాజ్యమునకుఁ బోయి హైదరాబాదునగరమునందుఁ గల తురకవారల నాశ్రయించి వారిమీఁదపద్యములు చెప్పి తన్మూలమున నబాబుయొక్క దయను సంపాదించి, నిజాము ప్రభుత్వమునకు లోఁబడిన సామంతరాజ్య మైనవిజయనగరమునకు ప్రభువగు శ్రీవిజయరామరాజుగారివద్దకుఁ దనగ్రంథమును నీలాద్రిరాజు సమ్ముఖమున సభలోఁ జదివించి వెంట్లు వారివద్దనుండి యుత్తరువు తెచ్చి యట్లు చదివించి చెప్పినను. ఆతఁడు గ్రంథమునందు నీలాద్రిరాజు నెంత దూషించినను, తప్పొక్కయును సరసమూంబరు దూషింపక యాపత్రివతి నిట్లు భూషించెను —

క. ఖుదఁ దైవీలనృపుఁ డీ । యిలపై నిన్నాళ్ళు బ్రతుకునే నరసాంబా
గళకలితకేళిమయ ముగుం । గళసూత్రోత్కృష్టమహిమఁగాక కుమారా.

ఈగ్రంథము రించుమించుగా నన్న తిరువదియంతకాలము జీవించినట్లు కనఁబడుచున్నది. అందుచేత నితఁడు ౧౭౨౦ వ సంవత్సరప్రాంతమును మొదలుకొని ౧౭౬౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించియుండినవాఁడని చెప్పవచ్చును. ఈతఁడు రచియించిన గ్రంథములలో నాలాశ్వాసములు గలసుభద్రాపరిణయము మనోహరముగాఁ గనఁబడుచున్నది. ఆపుస్తకమునందు జగన్నాయకస్వామినిగూర్చి వ్రాయఁబడిన మొదటిపద్య మిట్లున్నది—

ఉ. శ్రీయలరన్ సుభద్రయును సీయుఁ బార్శ్వముల న్నెలఁగి న
త్యాయతలీల నీలమధరాగ్రమునందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కనపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయకదేవదేవుఁ డభినంద్యకృపామతి మమ్ముఁ బ్రోచుతన్.—ఆ. ౧.

సుభద్రాపరిణయమునం దితఁడు—

గీ. నన్నభట్టార్యుని దిక్కన సోమయాజి । సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతనఁ బ్రాజ్ఞవరుని । శంభుదాసుని భాస్కరు సంస్తుతింతు.

అని కవిస్తుతి చేసి తనయన్న యగు తిమ్మకవి నిట్లు పొగడి యున్నాఁడు—

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతునిఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగులచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభునిఁ గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యధౌరేయుని బుధజనప్రియచరితుని
దండలూరి లింగనారాధ్య దేశికేంద్ర । దత్తమాహేశ్వరాచారవృత్తిరతునిఁ
గందరాడఘనగ్రామమందిరుని మ । దగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు.

ఇతఁడు తనగ్రంథములను జగన్నాథస్వామి కంకితము చేసెను. ఈకవిచే రచియింపఁబడిన జానకీపరిణయము మొదలయినగ్రంథములు నాకు లభించినవి కావు. ఇతఁడు కాకతిప్రతాపరుద్రవంశజుఁడయిన మంతెపాటి నారాయణరాజుయొక్క ప్రేరణముచేతఁ బ్రతాపరుద్రమహారాజును వర్ణించుచు సోమదేవరాజీయ మనుమూఁడాశ్వాసముల గ్రంథ మొకటి రచియించెను. కవియొక్క కవితానైపుణిని జూపుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాను—

సుభద్రాపరిణయము.

చ. సుమవిరలీలఁ గన్గొనయె శోభనదివ్యసరోజమాలికా
పరిమళలాభలోభమదబంభరడింభరవానుషంగ దు
ష్కరదురితౌఘభంగ నలిభాస్వరగాఢతరంగ రంగదీ
శ్వరముకుటాగ్రరంగ శుభసంగను గంగఁ దగంగ వేంగటన్ — ఆ. ౧

ఉ. ఆయమునీలలామము లందంచితలీలలఁ గాంచి కోకకా
సారము సారసౌరభవిశంకటసారసపుంజసంకుల
ద్వారమరందపానపరిలంపటమాద్యదళీంద్రసాంద్రఝం
కారము కోకహంస బకకచ్ఛపమీనధునీకుళీరమున్. — ఆ. ౩

శా. కారం బయ్యె నితంబినీమణికిఁ గాంతారంబు శీతాంబరంబుం
గారంబుల్ సముదగ్రశోకజనకాహంకారంబులై చంద్రోద్ధతా
కారంబుల్ గుసుమాస్త్రచాపగుణటంకారంబు రాయంచకేం
కారంబుల్ ఘనదావకాగ్నిరవహుంకారంబు ఘోషంబులన్ — ఆ. ౨

చ. తనుతనుభవసాత్వికాలుఁగనుదమ్ము విలోకించుచుఁ జిప్పి కన్యకా
తిలకము చూచె నీలమణిదీధితిజాలమనోజ్ఞగాత్రునిన్
జలదరాతిజైత్రునిఁ గృపాపరిపూరితనేత్రునిన్ సమా
కలితవిలాసచైత్రుని జగన్నుతిపాత్రునిఁ బాండుపుత్రునిన్.—ఆ. ౫.

సోమదేవరాజీయము.

శా. అన్నా యెక్కడనుంటి వొక్కఁడవు రేయాహా మహైశ్వర్య మీ
వెన్నన్ బాలుఁడ విట్టు లుంట విహితంబే చేయు సజ్జాతులన్
నిన్నుం గానక కుందుచుంటిమి గదా నిక్కంబు మాప్రాణముల్
కన్నారన్ నినుఁ జూడకున్న నిలువంగా నేర్చునే రేశమున్.—ఆ. ౧.

ఉ. వింటిర మీర లిప్పు డొకవింత కువాళపుబండివాఁడు మొ
న్నంటి శార్ధభాగమున నాచి మహేశగృహంబు చొచ్చి రా
బంటులె నిన్న రేయి మనపట్టణభూసురవస్యుఁ గొట్టి వా
రింటిపదార్థ మెల్ల హరియించి రనాయక మయ్యె రాజ్యమున్.—ఆ. ౨.

## కొఱవి గోపరాజు.

ఈకవి యాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; గోపరాజు పౌత్రుఁడు; కసువరాజునకును కామాంబికకును పుత్రుఁడు. ఇతఁడు సింహాసనద్వాత్రింశిక యను పేర విక్రమార్కునికథలను పండ్రెండాశ్వాసముల పద్యకావ్యముగా రచియించెను. ఈద్వాత్రింశత్సాలభంజికల కథలను రచించుటనుగూర్చి కవి యిట్లు వ్రాయుచున్నాఁడు—

క. అప్పరమేశ్వరుకరుణన్ । గుప్పలుగొను విక్రమార్కగుణములకొఱకై
చెప్పెద రసభావంబులు । చిప్పిలఁగొనునట్లు కథలు ముప్పదిరెండున్.

ఈకవివంశమునకు మూలపురుషుఁడై పెన్నయామాత్యుఁడు

సీ. కలుషమండలికభేకఫణీంద్రుఁడన రాయగజగంధవారణఖ్యాతి వెలసి

* * * *

నెగడె నందవోలు నెలవుగా భూసుర । వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధుర్యుండు । విక్రమార్కనిభుఁడు పెన్నవిభుఁడు.

అనుపద్యమునుబట్టి నందవోలురాజులయొద్ద మంత్రిగానుండి బిరుదముల నందినట్లు కను

పట్టుచున్నాఁడు. ఇతఁడు పదునాలవ శతాబ్దమధ్యమునందుండియుండవచ్చును. కాఁబట్టి యీపెన్నయామాత్యున కేడవపురుషుఁడైన కవి తరువాత నూటయేఁబది సంవత్సరములకనఁగా పదునేడవశతాబ్దాంతమునం దుండి యుండును. కవిపితృఁడైయైన కసవరాజు వేముగల్లుపురాధీశ్వరుఁడయిన వల్లరాజు మంత్రియైనట్టు

శా. రాణన్ మల్లనృపాలుకీర్తిచంద్రికలు సర్వంబొంది మధ్యాశ్రిత
క్షోణీభృద్విసరదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి యీ
క్షోణిన్ శ్రీపురుషోత్తమాశ్రయమునై శోభిల్లి దానామృత
శ్రేణిన్ త్యాగసముద్రనామము వహించెన్ వేముగల్లిమ్మహిన్.

ఇత్యాది పద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. కాని యీమల్లనృపాలుఁ డెవ్వఁడో యేకాలమునందుండినవాఁడో యింకను విచారింపవలసియున్నది. ఎట్లయినను గవి యించుమించుగా నిన్నూఱుసంవత్సరములక్రిందటివాఁ డగుటకు సందేహము లేదు. ఈ విక్రమార్కచరిత్రములోని గద్యమునందు

"ఇది శ్రీమద్గజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్ట విభాళాది బిరుద ప్రకటచారిత్ర కొలని పెన్నయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితంబైన......"

అని పెన్నయామాత్యుఁడు తనకు తాతయైనట్లు చెప్పుకొనెనుగాని వంశవర్ణనమువలన నతఁడు కవి కేడవపురుషుఁడైనట్టు స్పష్టముగ నున్నది. ఈ ద్వాత్రింశత్సాలభంజికాకథల కవిత్వము విక్రమార్కచరిత్రమును రచించిన జక్కనకవిత్వమునకుఁ జాలకపోయినను మొత్తముమీఁదఁ జక్కనిదిగానే యున్నది. ఈపుస్తకములోనివిరెండుపద్యము లిందుఁ బొందుపఱుపఁబడుచున్నవి—

ఉ. అన్నలొ తమ్ములో చెలులొ యాత్మజులో నను వారు వీరికై
మిన్నక చావ నేల యిది మేలె భుజిన్ బలిభోజికయ్యె నా
యున్నెడ విశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మూనఁగ
న్నన్న నెతింగి యొండెడకుఁ జాగుఁడు ప్రాణము తీసి చూచితే.—ఆ. ౪.

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
సేవసుధేశు నీయెదుట సెన్నఁగవచ్చు మదీయజిహ్వాల
జ్జావశమై చలింప దిఁక సద్గుణముం దగ సద్గుణాఢ్య ప్ర
స్తావన చేయు నేరనియతం డతిమూర్ఖుఁడుగానఁ జెప్పెదన్.—ఆ. ౧౧.

## కొడిచెర్ల-శ్రీనివాసకవి.



ఇతఁడు శేషధర్మరత్నాకర మనియెడి యాఱాశ్వాసముల పద్యకావ్యమును రచియించెను. ఈగ్రంథమును శేషధర్మము లనియు నందురు. ఈకవి యాత్రేయ గోత్రుఁడును కొండయ భవానిపుత్రుఁడును; రాజమహేంద్రపుర నివాసుఁడు. ఇతఁ డిన్నూఱుసంవత్సరములకు ముందుండినవాఁడు. ఇతఁ డొకవేళ పదునేడవ శతాబ్ద మధ్యమునందుండి మధ్యకవులలోఁ జేరవలసినవాఁడేమో! పుస్తకములోని

"ఇది నవీనసాహసబంధ బంధుర ప్రబంధ నిబంధనా చాతురీ ధురీణ సకలకళా ప్రవీణ ఆత్రేయగోత్రపవిత్ర కొడిచెర్ల కొండయభవానిపుత్ర ఐవరగండ బిరుద ప్రచండ మంత్రిమార్తాండ సమస్త సద్గుణావాస శ్రీనివాసప్రణీతంబైన హరి వంశంబునందలి శేషధర్మసారంబను మహాప్రబంధంబునందు."

అను గద్యమునుబట్టి చూడఁగా నితఁడు మంత్రిశిఖామణియై బిరుదముల నందినట్లును, అత్యంతాధునికుఁడు కానట్లును, కనఁబడుచున్నాఁడు. ఈతనికవిత్వము ప్రౌఢమయి రసికజనహృదయంగమముగా నున్నది. ఈతని శేషధర్మములనుండి కొన్నిపద్యముల నిం దుదాహరించుచున్నాను—

చ. నెలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచేఁ
దలకొనుఁ గ్రోధ మట్టిపెనిదం బగుక్రోధమునం దనర్చు మో
హలతిక మోహస్మృతి నుపక్షయం బగు విస్మృతి విస్మృతిం జనన్
దలఁపఁగ బుద్ధి బుద్ధి చెడినన్ మతిఁ దాఁ జెడు మానవుం డిలన్.—ఆ. ౧.

ఉ. మేఁడియు నీగిముల్ ముఖము మీఁద ధరించుచుఁ బోతునెద్దుతోఁ
గూడఁగఁ గాఁడిఁ బూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గముం
ద్రాడును మోకు వారెనయుఁ దాలిచి ముందట వెన్కఁ జుంగుఱే
లాడఁగఁ గాసెకట్టుకొని యుక్కుటిలాత్ముఁ డేఁగెఁ జేనికిన్.—ఆ. ౩.

ఉ. రామ కృపాభిరామ రిపురాక్షసవీరవిరామ సాహసో
ద్దామ లసద్గుణప్రకరధామ సమస్తనృపాలలోకసు
త్రామ విభాకరాన్వయసుధాసరసీశ్వరసోమ సద్గుణా
రామ నినున్ భజింపఁ గల రాజకళాధరుఁడైన నోపునే.—ఆ. ౫.



## పట్టమట్ట-సోమనాథకవి.



ఇతఁడు స్కాందపురాణములోని సూతసంహితను నేడాశ్వాసముల గ్రంథముగాఁ దెనిఁగించెను. ఈకవి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; వేంకటామాత్యపుత్రుఁడు. ఇతఁడు తన గ్రంథమును బిక్కనవోలి కామారెడ్డి కంకితము చేసెను. ఈగ్రంథము రచియింపఁబడినకాల మిప్పటికి నిన్నూఱుసంవత్సరములకంటె నెక్కువయినట్టు తోఁచుచున్నది. కృతిపతియైన కామినేని కామారెడ్డి యెప్పుడుండినవాఁడో తెలిసినదికాదు. కృతికర్త గోదావరీమండలములోనివాఁడు. సూతసంహిత కవిత్వము సలక్షణమయినదిగా నున్నది. కవితాధోరణిని దెలుపుటకయి సూతసంహితలోని పద్యములు కొన్ని యిందుదాహరింపఁబడుచున్నవి—

ఉ. మున్ను పురాణపూరుషుఁడు ముఖ్యుఁడు విష్ణుఁడు శంభుమాయపైఁ
గొన్నవిమోహితుండయి యకుంఠితగర్వ మెలర్ప నేన యీ
యున్నజగంబులం బొదివి యాదికర్తను బేరుగొన్న నా
కన్న ఘనుండు నాసముఁడు గల్గొన నెవ్వఁడు శాశ్వతంబుగన్.—ఆ. ౧.

ఉ. పాపము లట్టు కొన్ని యెడఁబాసిన రోగము లెల్ల మాని యు
ద్దీపితసత్త్వుఁడై దృఢమతిన్ శశివర్ణుఁడు త్వస్తరైకర
షాపరతంత్రవృత్తిఁ దృణకాష్ఠఫలోదకశాకమూలనా
నాపరిచర్యలన్ దినదినంబు గురున్ భజియించు నెంతయున్.—ఆ. ౩.

చ. సరవి నబోధమూల మగుసంసృతివృక్షము మూలనాశనం
బురుగతిఁ జేయు మంత్రరచితోదక పుష్పముఖార్చనంబు లే
సరణిని జాల హాత్తరతి జ్ఞానమె ముఖ్యశివార్చ యాబహి
ర్విరచితపూజనంబు లవివేకులు స్థూలము లందు రజ్ఞతన్.—ఆ. ౫.

ఉ. అట్టిమహేశ్వరుం దెలిసి యవ్యయధామము నొందవచ్చు నే
పట్టునఁ గర్మకోటి నది ప్రాప్తముకాదు సమస్తయజ్ఞముల్
గొట్టిన భూరిసంసరణనీరధి దాఁటఁగ మంటియోడ తా
గొట్టును మృత్యువున్ జరయు నేచును గేవలకర్మతంత్రులన్.—ఆ. ౭.



## ఓవి-రమణకవి.

ఇతఁడు వాసిరెడ్డి రామలింగప్రభుని ప్రేరణముచేత శృంగారధామమను రెండాశ్వాసముల ప్రబంధమును జేసి శ్రీమంగళగిరి నృసింహస్వామి కంకితముచేసెను. కవి తన్నుఁ గృతిచేయఁ బ్రేరేపించిన రామలింగప్రభుని దనప్రబంధమునం దిట్లు వర్ణించియున్నాఁడు—.

సీ. ఏధన్యువంశమునఁ దెలిమి సుమానాథువరమున నభివృద్ధివంతుఁ డయ్యె
నేమేటికూటస్థుఁ డెసఁగ వేమనృపాలుప్రీతిచే భువి వాసిరెడ్డి యయ్యె
నేమహాత్మునితండ్రి యొందెఁ గుతుబుశానృపాలుచే గజాందోళికంబు
లేమన్యు డగ్రజుఁ డెలమి శాత్రవవీరగజరాజసింహతఁ గలన నమరె
నతనివంశజుఁ డానికూటస్థజాతుఁ। డతఁ సత్పుత్రుఁ డాతనితమ్ముఁ డగుచు
నమరె బహుగుణరత్నరత్నాకరుండు। కదనవిజయుండు రామలింగప్రభుండు.

ఈపద్యమునుబట్టియే యీకవి సమర్థుఁడుగాఁ గవిత్వము చెప్పలేనివాఁడనుట స్పష్టమగుచున్నది. అభివృద్ధిమంతుఁడనుట కభివృద్ధివంతుఁడనియు, అందెననుట కొందెననియుఁ బ్రయోగించినను మొత్తముమీఁద కవిత్వము రసహీనమైనది కాదు. కృష్ణామండలములోని యమరావతీ సంస్థానప్రభువుల ప్రేరణమునుబట్టి పుస్తకమును రచించుటయు మంగళగిరి నృసింహున కంకితము చేయుటయు విచారింపఁగా నీకవి కృష్ణామండలములోనివాఁడనుట తేలుచున్నది. కుతుబుశాహ పేరొకటియుండుటచేతఁ గవి పదునేడవశతాబ్దమధ్యమున నుండిన ట్లూహింపఁదగియున్నది. శృంగారధామము నుండి రెండుపద్యము లిందుదాహరింపఁబడుచున్నవి—

చ. అళికులవేణికిం బ్రియుఁ డనంగనృపాలుఁడు దాడిచేసి యీ
వలకికి నేఁట రేపటనె వాసిగ రాఁగలఁడంచు బాల్యముం
గళవళమంది చిత్తిలఁగఁ గ్రుడెఁ దన్మఖరాజచిహ్నముల్
కలికి వయఃప్రకాశగుణకాంతియు బాల్యవయస్సుసంధిగన్.—ఆ. ౧

మ. సరినీవారొనిచింటి కేగఁ గని తోఁ జాలించి యున్నంతలో
నరయం దర్పల మేమి సున్నపటికుదీయాగంబు మాకిచ్చి యే
సరణింబోయెదఁబో మ్మటంచు వడిఁ జంచచ్చి త్రయై వేశ్య త
త్తరయుక్తాంచితకంకణంబు లొగిఁ దాఁ గాంక్షించి తీసెన్ వెసన్.—ఆ. ౨



## కోడూరి వేంకటాచలకవి.



ఈకవి స్కాందపురాణములోని శివరహస్యఖండమును తెనిఁగించెను. ఈతనికి బాలసరస్వతి యనుబిరుదాంకము గలదు. ఈతఁడు ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపసగోత్రుఁడు; ఎల్లనామాత్యపౌత్రుఁడు; శంకరామాత్యపుత్రుఁడు. ఈ శివరహస్యఖండము శ్రీగురుగుహ ముళువాగిళ్ళప్రభుని కంకితము చేయఁబడినది. ఇతఁడు బళ్ళారిప్రాంతములయందుండిన లింగబలిజప్రభువని తోఁచుచున్నది. ఈకృతిపతియొక్క పూర్వులలో నొకనిని వర్ణించుచు

క. ధరణీస్థలి నాపరశివ । చరణోద్భవులందు సకలశాస్త్రాగమధీ
భరణుఁడు వీరన్నృపాలుఁడు । వరభింగకగోత్రుఁ డగుచు బరిశోభిల్లెన్.

అని కవి యితని శివపాదోద్భవులనుగాఁ జెప్పినందునఁ దద్వంశజులు శైవశూద్రవర్ణమని చెప్పవచ్చును. కృతిపతియొక్క పితామహుని మాతామహుఁడైన చిక్కరాజను నామాంతరముగల ముళువాగిళ్ళప్రభు స్వీకరించినపద్యములలో మధురాపురీశ్వరుని జయించినట్లు శ్రీవేంకటపతిరాయలకాలములో నుండినట్లు కవి వర్ణించియున్నాఁడు—

మ. ప్రేంకారాతివిరాజితాగ్రభుజాప్రావీణ్యమింపార వా
రక యొంతే మధురాపురీశ్వరుని దర్పం బెల్ల వారించి భూ
రికృపాణోద్ధతిచేత వేంకటపతిశ్రీరాయసన్మాన్యుఁడై
చిక్కరాజాఖ్య నెసంగె భూనుత జయశ్రీధుర్యుఁడై వేడ్కన్.

క. అనుభవనాళునృపతి ధ । రామండలిఁ గీర్తిఁ గాంచె రాజత్కీర్త్య
ద్దామబలాపాస్య జయ । స్తోమమున శౌర్యధుర్యశీలాన్వితుఁడై.

సీ. ఏధన్యుకీర్తిశుభ్రోద్భాంతగంగంబు రంగంబు పార్వతీరమణిపతికి
నేవరేశ్వరుకరాగ్ర్యాసచంద్రహాసంబు హాసంబుఁ జేయు వజ్రాయుధంబు
నేరసజ్ఞునికీర్తి శారదామోదంబు మోదంబు హరిదంతములనుఁ గూర్చు
నేసుధీపతుభాషా శోభాసారంబు సారంబు బుధజనశ్రవణములకు
నతఁడు చెలువొందు కోటకాపార్యధైర్య
సహితుఁ డరివార్యశౌర్యమాంసలభుజుండు
గాంభీర్యసౌందర్యదానశీలు
సుప్రభావుఁడు ముళువాగిళ్ళప్రభుఁడు.

ఈపద్యములవలనఁ గృతిపతిపూర్వులు విజయనగరసంస్థానాధీశ్వరుల సేనాపతులై యుండి ప్రభుత్వము సంపాదించిరనియు మాత్రమే కాక కవికాలమును సరిగను నిర్ణయింప వచ్చును. వేంకటపతిరాయలు ౧౫౮౬ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకును రాజ్యము చేసినవాఁడగుటచేత నాతనికి నాలుగుతరముల తరువాత నున్న కృతిపతియుఁ గృతికర్తయు ౧౭౦౦ వ సంవత్సరప్రాంతములయందున్నట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇంతేకాక యాంధ్రకవిస్తుతిలోని యీక్రిందిపద్యములో బింగళి సూరన్నను బూర్వకవినిగా నభివర్ణించుటనుబట్టి కూడఁ గవి యర్వాచీనుఁడని చెప్పవచ్చును.—

సీ. చతురాస్యుఁ డనఁగను జగతి వాగనుశాసనప్రౌఢిఁ దెలుఁగునం దన్నపార్యుఁ
గుండలీంద్రుఁ డన నఖండమేధాస్ఫూర్తి నలరారు తిక్కనయజ్వమణిని
నచ్యుతైకసమాఖ్య నరచితవరభాగ ప్రకటించు శ్రీనాథసుకవివరుని
సన్నార్యులఁ సుప్రసాదతేజంబులఁ బ్రథవిల్లెడు సోమభాస్కరులను
భూనుతసత్కళాస్వజరాజుఁ బోతరాజు । శుభమనోరథుఁ బింగళి సూరనార్యు
మతియుతాంధ్రోక్తిశ్వాఘిర్వాణపటిమ । ఘనితకమలాప్తయులమహాకవుల నెంతు.

ఈక్రిందిపద్యములోఁ గవి కృతిపతియొక్క తాతయగు పొట్టిలింగభూపాలునిని తండ్రి యగు లింగభూపాలుని బహువిధముల వర్ణించియున్నాఁడు—

సీ. ఘనమార్గవర్తుల్ గానిగోధుల ఘనమార్గవర్తుల గాఁ జేసెఁ
గరిదానమహిమంబు గాంచనివిభుల కరిదానమహిమంబు గాంచఁ జేసె
మిత్రపద్ధతిదప్పి మెలఁగెడువైరుల మిత్రపద్ధతిఁ జెంది మెలఁగఁ జేసె
నెలమిఁ బావకు లాశ్రయింపనిఫలులను నెలమిఁ బాదము లాశ్రయింపఁ జేసె
ననుచు మెచ్చుచు జనులు మాధవనాయుని । యాతి దేవ్యాదిభుజపీఠి నాశ్రయించె
నతని సుతుఁ డింపఁ జిరమెన హార్యధైర్యు । భైరవు పొట్టిలింగభూపాలవర్యు.

* * * *

సీ. ధరణి రాజులు గాని ధరణిరాజులు గారు దీటుదాక్షిణ్యమాదివ్యరుచుల
నినతేజసులు గాని యినతేజసులు గారు ప్రతిప్రభావాటోపపటుబలముల
నలనరేంద్రులు గాని నలనరేంద్రులు గారు పురుషభాసురవచోభోగములను
గోత్రేశ్వరులు గాని గోత్రేశ్వరులు గారు సరిధైర్యబంధురైశ్వర్యములను
నతనికనిదిమ్మన్న భూమిశీపతులు దిశల । దెలసె నెవ్వాఁడు ప్రఖ్యాతి విస్తరిల్ల
నట్టి ఘనుఁడు వెలసిందె రాయవేశ్యాభుజంగ । జయవిజయదశాలి లింగభూజానిమౌళి.

ఉ. లింగనృపాలపుత్రుఁడగు లింగనృపాలుని శుద్ధకీర్తిశా
లింగని శారదాభ్రపటలింగని నాకధునీతరంగపా
లింగని నీలచేలునిహలింగని మానసవిస్ఫురన్నరా
లింగని పద్మగర్భునిచెలింగని సారె హసించు నెంతయున్

ఈపద్యము నుదాహరింపఁబడినపద్యములచేతనే యితఁడు ప్రౌఢకవియనియు నిరర్గళకవితాధారగలవాఁడనియుఁ దెలియు నయి యున్నను శివరహస్యఖండములోని కొన్ని పద్యములఁగూడ నిం దుదాహరించుచున్నాను—

సంభవకాండము.

ఉ. తేనియవాఁక యిచ్చటను దిన్నఁగ రాఁగదవే మృగీమదం
బీశైలతాలిబోఁదలిడు నిచ్చటజాజిమనుష్మ కోకిలో
ద్గాము లిందు విం టె కలకంఠి యటంచు పక్షిజనావళుల్
మామగ హెచ్చరింప ననమానమహామహిమాభిరావళ్యం. — అ ౧.

మ. పతితస్వచ్ఛశిరోజము ల్దరఁగా బల్లిస్తనామేననా
దళులున్ ప్రేలఁగఁ గంపమంద శిరమున్ వక్రించు నిర్దంతమై
వెలయన్ భూరిజరాతిభారమున గర్వీభూతుఁడై సారె ప్ర
స్ఖలదంఘ్రిద్వయు మొప్ప గద్దెనిక మించన్ వృద్ధవిప్రాకృతిన్. — అ. ౨.

ఉ. పోయెద నుండెదన్ సమరము ప్రచియించెద నాయధేచ్ఛ నే
లా యిటు లాడఁ దానకబలంబుఁ జలంబును లావుఁ జేవయున్
వేయివిధంబులం బలుక వేయును నాకు జయించు హాస మో
హో యిటు చాలుఁ జాలు విను మోరి వధించెద దానవాధమా — అ. ౫.

## ఏనుగు లక్ష్మణకవి

ఈకవి బహుగ్రంథములు చేసి ప్రసిద్ధి కెక్కినవాఁడు. ఇతఁడు చేసినగ్రంథములలో రామవిలాసప్రబంధము కడపటిదిగాఁ గనఁబడుచున్నది. ఈప్రబంధము పెద్దాపురసంస్థానము నుండిన శ్రీవత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. ఈ గోపరాజు తన్నుఁగూర్చి పలికినట్లు కవి తన రామవిలాసములో నీపద్యములఁ జెప్పుకొన్నాఁడు—

సీ. సుకుచిగాపస్తంబసూత్రు వాధూలసగోత్రు సద్వినయాదిగుణసమేతు
నేనుఁగు లక్ష్మకవీంద్రునిపౌత్రుని శ్రీమాధిరాజ్ నృసింహామంత్రి

దౌహిత్రుఁ భూవరాస్థానపూజ్యుఁడు తిమ్మయమంత్రికిఁ బేరమాంబకు సుపుత్రు
ధన్యు ననంతాభిధానానుజుని వీరభద్రున కగ్రజు భాగ్యవంతు
లలితకవితాకళాధుర్యు లక్ష్మణార్యు। నన్నుఁ బిలిపించి యుచితాసనమున నుంచి
చాలఁ గరుణించి తనముఖాబ్జమున మందహాస మమరఁగ నిట్లని యానతిచ్చె.

సీ. సృజియించినాఁడవు సేతురామేశ్వరమహిమంబు పాండిత్యమహిమ మెఱయఁ
గల్పించినాఁడవు ఘనతెన్నుజాహ్నవీమాహాత్మ్యకృతి సుధామధురఫణితి
నిర్మించినాఁడవు నిర్జరభాషచే శతకంబు భాస్కరస్వామి కలిమి
రచియించినాఁడవు రుచిరంబుగా సుభాషితరత్నమాలిక శివునిపేర
రమ్యవిశ్వేశ్వరోదాహరణ నృసింహ।దండకాదిస్తుతిప్రబంధములు గూర్చి
సభలలో నుత్తమఖ్యాతి నమరినావు।లలితగుణధుర్య యేమఁగు లక్ష్మణార్య.

గీ. వాణిజాసననారీముఖారవింద। సారసౌరభఘన ఘనసారసాంద్ర
వీటికాబంధురసుగంధవిభవమధుర।లలితవాగ్ధుర్య యేమఁగు లక్ష్మణార్య.

గీ. ధీరులు నుతింప నిప్పుడు మీరుసేయు। భాసురం బగురామవిలాసకావ్య
మంకితము చేయు మాపేర నచలధీర। ధరణి నాచంద్రతారకస్థిరముగాఁగ.

పైపద్యములవలన నితఁడు రామేశ్వరమాహాత్మ్యము, గంగామాహాత్మ్యము, గీర్వాణ సూర్యశతకము, సుభాషితరత్నావళి, విశ్వేశ్వరోదాహరణనృసింహదండకాదిస్తుతులు, రామవిలాసము, చేసినట్టు తెలియవచ్చుచున్నది. మఱియు నితఁడు విశ్వామిత్రచరిత్రము మఱియొక గ్రంథముగూడ రచించినట్లు సుభాషితరత్నావళి యవతారికలోని యీక్రిందిపద్యమువలనఁ గానవచ్చుచున్నది—

క. రామేశ్వరమహిమము వి। శ్వామిత్రచరిత్ర సూర్యశతకంబును గం
గామాహాత్మ్యము మొదలగు। శ్రీమత్కృతిరత్నములు రచించితి వఱియున్.

ఆఱువేల నియోగియైన యీకవి యాపస్తంబసూత్రుఁడు; వాధూలసగోత్రుఁడు; తిమ్మకవిపుత్రుఁడు; లక్ష్మణకవిపౌత్రుఁడు; మాచిరాజు నృసింహుని దౌహిత్రుఁడు. ఈతని తల్లిపేరు పేరమాంబ; అన్న యనంతకవి; తమ్ముఁడు వీరభద్రుఁడు. ఈకవి వంశమునకు మూలపురుషుఁడు పైఁడిపాటి సింగన్న. ఈకవిపూర్వులయింటిపేరు పైఁడిపాటివారయినను సింగన్నవంశజులలో నొకఁ డగు జలపాలామాత్యుఁడు పెద్దాపుర సంస్థానాధీశ్వరుఁ డగు గజపతిరాజుచే నేనుఁగును బహుమానముఁదుటచే నప్పటి నుండియు నేనుఁగువారని మాఱినది. ఈయంశమే సుభాషితరత్నావళ్యవతారికలో నిట్లు చెప్పఁబడినది—

సీ. పరమేష్ఠికుల్యాగ్రభావ్యమతు వాధూలుఁ డన బుధేంద్రుం డొప్పె నసఘమూర్తి
యమ్మునినాథువంశమ్మున క్షీరాంబుధి సుధాకరుఁడు జన్మించినట్లు
ప్రభవించె శ్రీపైడిపాటి సింగనమంత్రి వరతాగ్రగణ్యుఁడై తనరె సతత
మహిమ సంతానక్రమమున జలపాలసచివుఁ డొప్పె బలారిసచివసముఁడు
గజపతిక్షితిధర్తచే గజముతోడ నగ్రహారము లతఁడు పరిగ్రహించె
నెలమి నేఁడును వారన్న యింటిపేరు గలిగె నతనికి గజలాభగరిమవలన.

గీ. ఆద్యగజపతివత్సరసోమేశ్వరాగ్ర హారశాసనుఁడై మహోదారభాగ్య
మహిమ గలిగినజలపాలమంత్రిమణికి గంకిరాజు జనించె విఖ్యాతయశుఁడు.

ఈకవియొక్క పూర్వులు చిరకాలమునుండి పెద్దాపురసంస్థానమున నుద్యోగములలో నుండుచువచ్చిరి. వారిలోఁ గొందఱు కవులు సహితముండిరి. పయిపద్యమునఁ జెప్పఁబడిన గంకిరాజునకు మనుమఁడును కవికిఁ బితామహుఁడును పెద్దాడ గ్రామమునకు కరణము నయినయేనుఁగులక్ష్మణకవి పెద్దాపురసంస్థానమునం దుండి వత్సవాయివంశజు లయిన యచ్చటిరాజుల కనేకకృతు లంకితము చేసెను. ముందుగాఁ గవి తనతాతనుగూర్చి సుభాషితరత్నావళిలో చెప్పినపద్యములను మాత్ర ముదాహరించి యాతఁడు రచించినగ్రంథనామములను కృతిపతులనామములను రామవిలాస కృతిపతిని గూర్చి చెప్పునప్పుడు ముందు వివరించెదను—

ఉ. సాంద్రయశోజితద్రుహిణసారథికిన్ గురురాజమంత్రికిన్
పేరమయందు నందనుఁడు పేర్మి జనించె విలాససంపదన్
మారుఁడు విక్రమంబునఁ గుమారుఁడు లక్ష్మణశౌరి భూమిలో
భారవి సాహితీవిజితభారవి ధీరవిచారవిక్రమతిన్.

ఉ. దండిమనోజ్ఞశబ్దకవితారుచిచే నుపమానసమృద్ధిచే
రెండవకాళిదాసు రసరీతితరంగితసూక్తిఁ గుండలీం
ద్రుం డని ధీరు లెంచఁగఁ గృతుల్ రచియించినధన్యునిన్ మహా
పండితమాన్యు నెన్నఁదగు భాజితసూర్యుని లక్ష్మణార్యునిన్.

గీ. కృతు లొసంగి వత్సవాయితిమ్మనృపతిచేత నురగమణిభూషణాంబరతాంబూలికాది
పూజ గైకొని పెద్దాడపురవరాఖ్య శాసనం బయి లక్ష్మణశౌరి తనరె.

కవియొక్క యన్నగారైన యనంతార్యుఁడు గౌరీపరిణయకావ్యము రచించినట్లు సుభాషితరత్నావళిలోనే యీక్రిందిపద్యమునఁ జెప్పఁబడినది—

క. గౌరీపరిణయకావ్యము సూరీంద్రులు మెచ్చఁ జెప్పె శుంభత్కవితా
పారీణబిరుద మందిన భూరియశోఘనుఁ డనంతబుధవరుఁ డలరన్.

లక్ష్మణకవి రచియించిన రామవిలాసమునుబట్టి యితనికాలమును దెలిసికోవచ్చును.
ఇతఁడు కూచిమంచితిమ్మకవికి బంధు వయినను కాకపోయినను, అతనితో సమకాలికుఁ
డయినందునకు సందేహము లేదు.

క. హాటకగర్భవధూటీ । లాటనచలితాంఘ్రినూపురారావశ్రీ
పాటచ్చరములు తేనియ । తేటలు మాకూచిమంచి తిమ్మనమాటల్.

అను కూచిమంచి తిమ్మకవినిగూర్చినపద్య మీతఁడు చెప్పినదైన నయియుండవచ్చును.
రామవిలాసము వత్సవాయ గోపరాజున కంకితము చేయఁబడినది. కవి కృతినాయకుని

సీ. తనమహౌదార్యంబు తనమహాధైర్యంబుకరణి జీమూతలాఘవ మొనర్పఁ
దనవిమలకీర్తి తనవిక్రమస్ఫూర్తిపగిదిఁ బద్మాహితోపమ వహింపఁ
దనువిద్యాభూతి తనరూపవిఖ్యాతిగతిఁ గమలోద్భవగమ మీఱఁ
దనకార్ముకప్రౌఢి తనప్రతాపనిరూఢిభాతి ధనంజయప్రథిమఁ బూన
ధరణి నుతికెక్కె నిజభుజాదండమండ । లాగ్రదర్శనచకితమత్తారినృపుఁడు
వత్సవాయసింహాద్రిభూవరసుతుండు । ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

సీ. శారదనీరదనారదపారదహారదరస్ఫూర్తి నవఘళించి
శరదిందుకరకుంద శరబృందవరచందనహరిచందనకాంతిలహరి మీటి
హరకాంతహరిమంతహరిదంతకరిదంతవిధుకాంతపృథుకాంతవిధ హసించి
పురవైరిధరసీమగిరిదారిహరిశౌరిచరణనిర్ఝరవారిసురుచి గేరి
పాండురాఖండనిజకీర్తిమండలంబు । పుండరీకభవాండంబు నిండి మెఱయఁ
బ్రాభవము గాంచె సింహాద్రిరాజనుతుఁడు। ప్రణుతగుణశాలి గోపభూపాలమౌళి.

ఇత్యాదిపద్యములతో వెంతవర్ణించినను, ఈగోపరాజు పెద్దాపురసంస్థానాధీశ్వరుఁడు
గాక తత్సంస్థానాధిపతి యగుతిమ్మజగపతిమహారాజుగారి కాప్తబంధు వయి గౌరవము
నొందినవాఁడుగా నుండెను. అప్పుడు ప్రభువుగా నుండిన జగపతిమహారాజుల పుత్రుఁ
డగుతిమ్మజగపతిమహారాజుగారు ౧౭౫౯ వ సంవత్సరము మొదలుకొని ౧౭౯౭వ సంవ
త్సరమువఱకును రాజ్యపాలనము చేసిరి. ఈయన సింహాసనమునకు వచ్చినది ప్రమాది
సంవత్సర పుష్యశుద్ధదశమి. గతదినమున నీయనతండ్రి గా రగురాయజగపతిరాజు
గారు శ్రీపూసపాటి యానందగజపతిరాజుగారితో ఉండూరువద్ద జరిగిన యుద్ధములో
హతులైరి. అంగీరస సంవత్సర కార్తికశుద్ధ ప్రథమదినమున జననమొందినందున,
జనకుని మరణమునాఁటి కీయనకు వయస్సెనిమిదిసంవత్సరములు. ఈయన నలువది
యైదుసంవత్సరములు జీవించి పింగళ సంవత్సరాశ్వయుజబహుళపంచమినాఁడు పర
లోకగతులైనారు. ఈయనకాలమునం దుండి యీయనను బహుపద్యములతో స్తుతిం

చినవారగుటచే నేనుఁగు లక్ష్మణకవిగారు ౧౭౭౦-౮౦ సంవత్సరముల వఱకును జీవించి యున్నట్టు కనఁబడుచున్నది. అందుచేత నీకవి కూచిమంచితిమ్మకవి మరణానంతరమున నిరువదియేండ్లు జీవించియుండవచ్చును. పెద్దాపురపురాజు లగువత్సవాయివారు తాము మొదటినుండియు విద్వాంసు లయి విద్వత్కవుల నాదరించుచుండినట్లు వారివంశచరిత్రమువలన విస్పష్టమగుచున్నది. ఈవంశపువారి మూలపురుషుఁడు సూర్యవంశ్యుఁడయి కృష్ణామండలములోని గుడిమెట్ట రాజధానిగాఁ గల చాగిపోతరాజైనట్టు రామవిలాసములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది—

గీ. సహ్యజాతీరమునకు భూషణ మనంగ। సిరుల కిరవగు గుడిమెట్టపురము తనకు
రాజధానిగ సత్కళాభోజరాజు। చాగిపోతక్షమాభర్త జగతి నేలె

ఈసాగిపోతరాజుయొక్క శాసనములు గుడిమెట్టలోను నవాబుపేటలోను బెజవాడలోను ౧౧౩౦ వ సంవత్సరము వఱకును గానఁబడుచున్నవి. ఈతనియింటిపేరు సాగివారే యైనను, ఈతనివంశమువారిలో నొకఁడగు రామనృపాలుఁడు

"తగ వత్సవాయాఖ్యనగరంబు నిజనివాసము చేసె నదికారణముగ సాగి
వంశమునకు వత్సవాయి నామము లోక। సుప్రసిద్ధ మగుచు సొంపుగాంచె"

తననివాసమును వత్సవాయనగరమునకు మార్చినందున గృహనామము వత్సవాయివారయినది. వీరివంశజులలో నొకరగు (పేరరాజనుతు లయిన) ముసలి తిమ్మరాజుగారు ౧౫౫౫వ సంవత్సరమునకు సరియైనయానందసంవత్సర భాద్రపద బహుళసప్తమినాఁడు పెద్దాపురసంస్థానమును సంపాదించి ౧౬౦౭వ సంవత్సరమునకు సరియైనపరాభవసంవత్సర మార్గశిరబహుళ ద్వితీయవఱకు నేఁబదిరెండుసంవత్సరముల రెండుమాసముల యిరువదియైదుదినములు రాజ్యముచేసి లోకాంతరగతు లయిరి. దిట్టకవి విశ్వనాథకవి విరచితమైనశేషధర్మముల కృతినందిన దీయనయని రామవిలాసములోని యీపద్యము తెలుపుచున్నది—

సీ. బిరుదాంకపురి సుస్థిరముగా నిర్మించెఁ బాలమున్నీటిని బోలు చెఱువు
తిరుపతివల్లికి గిరిఁ బూలపల్లెను ఫలవృక్షవనములు నిలిపెఁ జాల
నృహరిగేహతటాకనిక్షేపవనములు కోమరుగాఁ బెద్దాపురమున నునిచె
విశ్వనాథకవీంద్రవిరచితశేషధర్మప్రబంధము సాదరముగ నందె
విప్రవరప్రపక్షులు వెలయఁజేసెఁ। బుత్రులను గాంచె నీతిని బుడమి నేలె
వత్సవాయన్వయమునకు వన్నెఁదెచ్చె। హెచ్చి పేరయతిమ్మధాత్రీశ్వరుండు.

ఈతిమ్మరాజుగారు డెబ్బదియాఱుసంవత్సరములు బ్రతికి కాలధర్మము నొందఁగా, శ్రీముఖసంవత్సర కార్తికశుద్ధపంచమినాఁడు జనన మొందిన యీయనపుత్రుఁడు రాయపు

రాజుగారు ౧౬౦౪వ సంవత్సరమునందు తండ్రిపోఁగానే రాజ్యపరిపాలన మారంభించి నలువదిరెండుసంవత్సరములు రాజ్యము చేసి ౪౫ ఏండ్లు బ్రతికి ౧౬౪౮వ సంవత్సరమునకు సరి యైనసర్వధారి సంవత్సర మాఘ శుద్ధసప్తమినాఁడు పరమపదప్రాప్తి నొందిరి ఈయన హరిభక్తిసుధోదయ మనకృతినందిన ట్లీక్రిందిపద్యము చెప్పుచున్నది—

సీ. శ్రీరాముఁడుఁ గట్టమూరను గట్టించె గుళ్ళు మంటపములు గోపురములు
గంభీరజలతటాకంబు త్రవ్వించె గృహస్థపురంబున సుస్థిరముగఁ
బొలుపుగా వాల్మీకిపురికాండ్రకోటను ఫలభూజవాటికల్ పాదిలపఱిచెఁ
బ్రఖ్యాత మగుహరిభక్తిసుధోదయం బనుమహాకృతిరత్న మందుకొనియెఁ
బేరుగలుగు సహమ్మకుబేరు నరిమి। మెచ్చఁగాఁ దగినఘవీలు తెచ్చుకొనియెఁ
బరగు రసువారిగుండియు గ్రిగులుకొనఁగఁ। దిమ్మనృపరాయపత్రుమాధీశ్వరుండు.

ఈయన యనంతరమందు పింగళసంవత్సరాశ్వయుజ శుద్ధసప్తమినాఁడు జన్మించిన యీయనపుత్రుఁడు సార్వభౌమ తిమ్మరాజుగారు సింహాసనమునకు వచ్చి ముప్పదితొమ్మిది సంవత్సరములు ప్రజాపరిపాలనము చేసి డెబ్బదవయేఁట ౧౬౮౮వ సంవత్సరమునకు సరి యైనవిభవసంవత్సర ఫాల్గుణబహుళత్రయోదశినాఁడు దేహావియోగము నొందిరి. మన కవితాత యైన యేనుఁగు లక్ష్మణకవిగారి కీయనకాలమునందే యుండి యీమహారాజునకుఁ దాము రచించిన ద్రౌపదీపరిణయము నంకితము చేసిన టీక్రిందిపద్యములవలనఁ దెల్ల మగుచున్నది—

సీ. రాజులు మెచ్చఁ బల్నాటికోట సాధించి సరిహరిసేన దుర్గము మడంచెఁ
గదుగైరభావిణికోట లగ్గలుపట్టి యోందుకోటంయు మువ్వఁ గెలిచె
దగరాజు మొదలైనవారలను భంగించె విశ్వంభరుని యుద్ధహతుఁ జేసెఁ
దగఁ బూసపాటి సీతారామభూపాలుఁ డభిమానియగ ప్రియుంబు గాంచె
సాహసమున నవాబ్షీను నురిగపతిని। గయ్యమున గెల్చె లోకవిఖ్యాతి చెందె
వత్సవాయాన్వయమునకు వన్నె తెచ్చె। రాయపరిపాలు శ్రీతిమ్మరాజమౌళి.

చ. హరిహరపద్మజాంశభవుఁడై తగు నేనుఁగు లక్ష్మణార్యుచే
సురుచిరశబ్దభావరసశుంభదలంకృతిమాధురీమనో
హర మగుద్రౌపదీపరిణయం బను నుత్తమకావ్య మంది నుం
స్థిర మగుకీర్తి సొంపెసఁగఁ దిమ్మనృపాలుఁడు ధర్మపద్ధతిన్.

ఈయేనుఁగు లక్ష్మణకవియే ధ్రువచరిత్రమును వేంకటరాజపుత్రుఁ డగుజగ్గరాజునకును, తుల్యామాహాత్మ్యమును కస్తురిరంగరాజపుత్రుఁ డగుజగన్నాథరాజునకును, వత్సవాయ

కులజులయిన రామబంధుకవుల కంకితము చేసిన ట్లీక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చు
చున్నవి—

చ. కవికులసార్వభౌముఁ డనఁగాఁదగు నేర్పుగలక్ష్మణార్యుచే
భువనపవిత్రప్రబంధము బుధుల్ వినుతింపఁగ నంది యాగభు
గ్భవనము సాముగా సుభవకారణ మైన యశంబు గాంచె వా
సవనిభుఁ డౌను వత్సవయ జగ్గనృపాలుఁడు సద్గుణోన్నతిన్.

ఉ. హేమనగేంద్రధీరుఁ డగునేర్పరి లక్ష్మణసత్కవీంద్రుఁ డు
ద్దామసుధామయోక్తి వితతంబుగ నట్లు రచించినట్టి శు
ల్యామహిమ ప్రబంధము గుణాఢ్యులు మెచ్చఁ బరిగ్రహించెఁ బ్ర
జ్ఞామహిమంబు జగ్గనృపచంద్రుఁడు శాశ్వతకీర్తి సందిలన్.

ఈతిమ్మరాజుగారి యనంతరమునందు వారి యనుజులైన బలభద్రరాజుగారికుమారులు
రామపరాజుగారు ౧౬౮౮ వ సంవత్సరమునందు రాజ్యమునకువచ్చి యిరువదియేడు
సంవత్సరములు పరిపాలనముచేసి నలువదేండ్లప్రాయమున ౧౭౧౫ వ సంవత్సర
మునకు సరియైన మన్మథ సంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్థినాఁడు పరమపదమునొందిరి.
ఈయన తండ్రి యగు బలభద్రరాజుగారు తాము కవులయి రామశతకము చెప్పుటయే
కాక కిరాతార్జునీయకృతినందిన ట్లీపద్యము తెలుపుచున్నది—

చ. అమితఖ్యాతికి మూలమైనకృతిఁ దానందెన్ గిరాతార్జునీ
యము శ్రీరాములపేరఁ బద్యశతకం బాయూఢి నిర్మించె భో
జమహీనాథగతిన్ బ్రతిష్ఠ గనియెన్ సాహిత్యప్రాజ్ఞుఁడై
రమణన్ శ్రీబలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్.

తరువాత రామపరాజుగారికుమారుఁడు తిమ్మరాజుగారు రాజ్యమునకు వచ్చి దాదాపుగా
యిరువదిసంవత్సరములు పాలనముచేసి ముప్పదిసంవత్సరముల ప్రాయమునందే ౧౭౩౫ వ
సంవత్సరమునకు సరియైన రాక్షసనామ సంవత్సర చైత్రశుద్ధ ద్వాదశినాఁడు పరమపదము
నొందిరి. తదనంతరము వారి పుత్రుఁడు శ్రీరామజగపతిరాజుగారు రాజుగాఁజేయఁబడి
యిరువదిసంవత్సరము లొమ్మిదినెలలు రాజ్యపాలనముచేసి యుండి దూరవద్ద పూస
పాటి యానందగజపతిరాజుగారితో జరిగిన యుద్ధమునం దిరువదియైదుసంవత్సరముల
యీడునందే ౧౭౪౯ వ సంవత్సరమునకు సరియైన ప్రమాదిసంవత్సర పుష్య శుద్ధ
నవమినాఁడు రణనిహతు లయిరి. ఈయన పిన్నటనే యొక్క లక్ష్మణకవిగారి
శిష్యుఁడయియుండిన (రామజగపతిరాజుగారి పుత్రుఁడయిన) తిమ్మజగపతిగారు
రాజ్యమునకు వచ్చి ౧౭౬౪ వ సంవత్సరమువఱకును ప్రభుత్వముచేసి స్వర్గస్థు లయిరి

పయి నివసించిన చరిత్రను బట్టి పెద్దాపురసంస్థానాధిపతు లందఱు నించుమించుగాఁ దాము కవులయ్యును కవుల నాదరించి కృతులందినవారయ్యును ఉండిరని తెలియవచ్చుచున్నది. ఏమనఁగ లక్ష్మణకవి తిమ్మజగపతిరాజు తండ్రియగు రామజగపతి మహారాజుగారి కాలములో సహిత ముండినట్లు తద్రచితమైన యీచాటుపద్యము పలుకుచున్నది.

ఉ. ఆ మతివత్సనాయకకులాంబుధిపూర్ణకళాపతీ జగ
ద్గేయగుణాకృతీ! విదితకీర్తిసతీ కమనీయయౌవన
ప్రాయమదనాకృతీ సతతవైభవనిర్జితపూర్వదిక్పతీ
ధీయుతవాక్పతీ జగపతీ నృపతీ సుకృతీ మహోన్నతీ.

ఈజగపతిరాజుగారు కవిత్వమునందు నిపుణులయి పెక్కుపదములు శతకములు దండకములు మొదలయినవి భద్రాద్రిరామునిమీఁదఁ జెప్పినట్లు రామవిలాసములోని యీ పద్య ముద్ఘోషించుచున్నది—

చ. పదములు కీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికల్
మృదుపదదండకంబులు సమిద్ధగతిన్ రచియించి కామిత
ప్రదునకు భద్రశైలరఘునాథునకుం గానుకగా నొసంగె నా
త్రిదశులు మెచ్చఁగా జగపతిప్రభుచంద్రుఁడు భక్తి పెంపునన్.

ఏమఁగ లక్ష్మణకవికృతములయిన గ్రంథములలో సుభాషితరత్నావళియు రామవిలాసమును మాత్రము నాకు లభించినవి. ఇందు మొదటిపుస్తకము భర్తృహరియొక్క సంస్కృతగ్రంథమునుండి తెనిఁగింపఁబడినను, కొంచెమయినను విరసముగా నుండక మూలానుసారముగాను నిర్దుష్టముగాను రసవంతముగాను హృదయరంజకముగాను ఉన్నది. స్వప్నమునఁ బెద్దాపురగ్రామమునందలి సోమశంకరస్వామి తనహృదయమున సాక్షాత్కరించి సుభాషితరత్నావళిని దెనిఁగింపు మన్నట్లు కవి యీపద్యమునఁ జెప్పుకొన్నాఁడు—

సీ. కలధౌతగిరియును గలశౌతగిరియును విల్లుగాఁ బొడవైనయిల్లుగాఁగఁ
గమలాహితుండును గమలాహితుండును శరముగా లలితశేఖరముగాఁగఁ
బద్మోద్భవుండును బద్మోద్భవుండును సారెగా మెయిఁదాల్చుబూరెగాఁగఁ
బవనప్రియుండును బవనప్రియుండును సొమ్ముగా ఫాలనేత్రమ్ముగాఁగఁ
గ్రాలుపెనువేల్పు సమ్మోదవాలుదాల్పు! జగములకు ఱేఁడు ధనదునిసంగడీఁడు
మారుఁడు పెద్దాడ సోమశంకరుఁడు హృదయ! సరసిజంబున నాకు సాక్షాత్కరించె.

రామవిలాసములోని యవతారికనుండి యున్నపద్యముల నుదాహరించినతరువాతఁ గవిత్వము నిర్దుష్టముగాను మృదుమధురవాగ్గుంభనలు కలదిగాను ఉండు నని వేఱుగఁ

ఉ. చందురువంటి నెమ్మొగము చాఁగెడుకన్నులు వృత్తదంష్ట్రముల్
సుందరపల్లవాధరము సోగకురు ల్మణికుండలప్రభా
బంధురకర్ణయుగ్మమును బాఱెడుచేతులుఁ గల్గు రాము నిం
గాంచఁగఁ జూచుచున్న నిలుపోపఁ దరంబె సుమంత్ర యుత్తతిన్. — అయో.

చ. ఇనకిరణాళికిం జొరవ యీక సదాగతిరాక కైనఁ బ
ల్చనపడ కర్క సైకతముఁ జల్లిక రాలఁగనీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కుల రామకాండముల్
నునిసితభంగి నిండుటయుఁ జూచి సుర ల్వెఱఁగంది రయ్యెడన్. — అరణ్య.

ఉ. భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జంపుటకై కడంగి సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి స
న్నీవిధిఁ జంపి తట్టిదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ
దేవిని నెందు డాఁచినను దెచ్చియొసంగనె యొక్కవ్రేల్మిడిన్. — కిష్కింధా.

ఉ. ఓరిదురాత్మ యీఁదు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన నొల్లవొ శిక్షలేమి నా
చారవిహీనమై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడు న్నిజంబుగన్. — సుందరకాం.

మ. మఱియున్ రావణి సాయకంబులు ధనుర్మార్గంబు దగం గూర్చి బ
ల్గురులాడం దెగనిండఁదీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణక్షతజాతరక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్. యుద్ధకాం.

కృష్ణజన్మఖండము.

చ. సలలితశుద్ధతోయములు చారుమణీదళపద్మకైరవో
త్పలములు గంధలుబ్ధకసుతానమధువ్రతగీతనాదముల్
కలరవచక్రకుక్కుటమరాళమనోహరమంజుళధ్వనుల్
గలిగి మనోజ్ఞసంపదలఁ గ్రాలు విశాలసరోవరం బొగిన్. — అ. ౩.

మ. పరికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశకాంతామణీ
పురుషప్రేమగుణాతిరిక్త మనిశంబుల్ బూతచారిత్రయున్
స్వరసారజ్ఞయు సాధ్వియున్ రసికయున్ జాతుర్యసంయుక్తయౌ
తరుణీరత్న మెఱుంగ సత్పురుషుఁడున్ దథ్యంబు చింతింపఁగన్. — ఆ. ప్ర.

శిశుపాల వధము.

శా. సామర్థ్యంబున మాఱులేనిబల మన్యం బవ్విధి న్నీతివి
ద్యామర్యాద నెఱింగి పోవుబల మన్యం బిట్టు లీరెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకుం జీఁకట్లకుంబోలె బ
ల్సామానాధికరణ్య మెట్లు గలుగున్ జర్చింప లోకంబునన్.—ఆ. ౧.

చ. అలఘుధనుష్ప్రభావము గుణాతిమహత్త్వము ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచు నున్నవొ యేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్రజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్.—ఆ. ౪.

భగవద్గీత.

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱునదీప్రవాహముల్
నిండి చలింపకున్న యలనీరధిఁ జేరినమాడ్కి దివ్యసం
దండిగ సర్వకామములు తప్పక చేరు నతండు శాంతుఁడై
యుండు సకాముఁడైనరుఁ డొందఁడు శాంతిని బాండునందనా.

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ నిజంబు నెఱుంగుదు రజ్ఞులైన ని
శ్చలమతిహీనులొక్కమొగిఁ జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁ దగునీశ్వరుం దెలియఁజాలరు భారత నిక్క మింతయున్.

